# Sree Rama :: :: Vijayam

## A Telugu Drama in five acts



ADURY VENKATA RANGASWAMY
AYYANGAR

శ్రీరామచంద్రగ్రంథమాల - చతుర్థపుష్పము.

# శ్రీరామవిజయము

(అయిదంకముల నాటకము)


గ్రంథకర్త

ఆసూరి వేంకటరంగస్వామి

అయ్యంగారు



మొదటికూర్పు 500 ప్రతులు

గుంటూరు చంద్రికాముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడి

గ్రంథకర్తగారిచేఁ
ప్రచురింపఁబడియె.

1936





[వెల రు 1-0-0]

# కృతిసమర్పణము.

మ. తలిదండ్రుల్ మృతిఁజెందఁ జిన్నఁటనె పు
త్రప్రేమచే సర్వవి
ద్యల బుద్ధిం గఱపించి యీపయిని ను
ద్వాహంబు గావించుస
త్కళు, శ్రీవైష్ణవు 'చిల్కపా'ట్యభిధ 'రం
గాచార్య' నామాంకు మా
తులునిం గావ్యపతి న్బొనర్చి కడు సం
తోషంబున న్మించెదన్.



# గ్రంథకర్తృ విజ్ఞప్తి



పాఠకులారా

వాల్మీకి ఋషిపుంగవకృత శ్రీమద్రామాయణ మహాకావ్యాంశమును శక్తికొలఁది నాటక పంచకరూపమున నా రచియించిన వానిలో నీ "శ్రీరామవిజయము" నాల్గవది. ఇది తే 25-12-'34 ది నుండి తే 6-5-'35 ది లోనికాలములో వ్రాయఁబడినది. మాటమాత్రమున దీని నామూలాగ్రము తిలకించి దీనికిఁ బీఠిక వ్రాసి పంపిన నామిత్రులును 'పురుషోత్తమమాహాత్మ్యాది' గ్రంథకర్తలును, శతావధానులును, శికిందాబాదుపురవాస్తవ్యులు నగుబ్రహ్మశ్రీ చివుకుల వేంకటాచలశాస్త్రిగారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడ.

ఈగ్రంథముద్రణమున, ప్రూఫులుమున్నగునవి సరిచూచి, సామాన్యపుష్పములఁ జేతి కియ్యఁగా, మనోహరపుష్పదామము గట్టి నా కందఁజేయు నామిత్రులగు మధ్వశ్రీ పళ్ళె వేంకటసుబ్బారావు పంతులుగారికిని, బ్రహ్మశ్రీ చతుర్వేది అమరేశ్వరశాస్త్రిగారికిని గృతజ్ఞతాపూర్వకాంజలిశతములు.

శ్రీమద్రామాయణ గాథామధుపాన కౌతూహలాయత్తచిత్తులగు పాఠకభృంగములకు శ్రీరామచంద్రగ్రంథమాలా చతుర్థాంబుజంబు సమర్పించు

ఒంగోలు,<br>6-5-'36.

శ్రీవైష్ణవ, విద్వచ్చరణపరమాణువు,<br>ఆదూరి వేంకటరంగస్వామి అయ్యంగారు.



# పీఠిక

ఈనాటకకర్త యగుకవి ఆదూరి వంశ్య వేంకటరంగస్వామి, అయ్యంగారు అనునామధారియగుటచే విశిష్టాద్వైతియని వేరుగఁ జెప్ప నక్కరలేదు. అందులకు వన్నెగాఁ దనకు సాలోక్యాదిముక్తి లొసఁగు రామభక్తితో రామాయణకథ నింతకుమున్ను మూడునాటకములుగ రచియించి తరువాయికథను 'శ్రీరామవిజయమ'ను పేర నీనాల్గవనాటకమును రచియించియున్నవాఁడు. ఈకవి కాంధ్రకవిత్వమందేకాక యాంగ్లభాషయందును, ధనుర్విద్యయందును బ్రవేశము కలదు. ఇవ్విప్రవైష్ణవాగ్రణికిఁ గలధనుర్విద్యానైపుణ్యముఁ జూచుతఱి పరశురామాంశజత్వ మీయనకుఁ గలదని యూహింపఁబడెడి. అందుననకాఁబోలు శివద్వేష మీయనహృదయమున నావంతయుఁ గనుపట్టదు. అది యటుండె. ఈయనకు సహజ మగుకవితాధోరణి కలదు. "నానృషిః కురుతే కావ్య" మనినట్లు సహజ మగుకవితా ధోరణి సామాన్యముగ నందర కలవడునది కాదు. పాండిత్యపుమాట వేరు. అదియు నుండెనేని బంగరువునకుఁ బరిమళ మబ్బినట్లే. ఈకవి బాల్యంబాది ప్రధానముగ నాంగ్లభాష నభ్యసించినవాఁ డగుటచే సంస్కృతభాషాపాండిత్యమునఁ గొఱవడియున్నను బుద్ధివైశద్యముచేఁ జిన్నిచిన్ని సంస్కృతసమాసంబులపట్ల నిపుణతయే చూపించెను. కాని తెలుఁగుబాసకు జీవంబగు సంస్కృతభాషలో నశిక్షితుఁడగుట నటనట నసాధుత్వము కాన్పించుచుండును. ఈయన యాంధ్రశబ్ద ప్రయోగసాధుత్వమునుగూర్చి అంతగాఁ జర్చింపవలసిన ట్లగపడదు. మఱియు సమన్వయఁపుఁబొందికలును నచ్చటచ్చట కాన్పింపకున్నవి. అయ్యవి గద్యములయందుకంటెఁ బద్యములయందు కొంచెము హెండు. వానిని గొన్నిఁటి మాదృశులు సవరించినను మఱికొన్ని దుర్నివారములు లేకపోలేదు. మహాకవులనినవారికిని నేవేని లోటుపాటులుండకపోవుగాని వారి కతిస్వల్పము. ఇక్కవి యారురుక్షు వగుటచే పురోభివృద్ధి కిట్లు సూచితము. అవిచారితముగ గ్రంథకర్తృప్రీతికై గ్రంథ మెంతయు సర్వాంగరమణీయ మనుటకంటె యున్నచోటనే రమణీయత నొప్పుకొనుట సమంజసమని పరిశ్రుతగ్రంథస్థము లగు

మనోజ్ఞవిషయములఁ గొన్ని యీక్రిందఁబొందుపఱుపఁబడియెడి. ఈ రూపకంబున నుత్ప్రేక్షలును, నీతిప్రాక్షరపద్యములును గలవు. ఇందలి మూఁడవయంకము పెద్దది. దీనిలో లక్ష్మణమూర్ఛ, మాయాసీతా హననము. నాల్గవయంకమున సీతాగ్నిప్రవేశము. ఇప్పట్ల కరుణా రసము హృదయముఁ గరగించునట్లు చక్కఁగఁ బోషింపఁబడినది. విభీషణేంద్రజిత్పరస్పరోపాలంభనంబును, ఇంద్రజిల్లక్ష్మణసోల్లుంఠనంబును తగురీతి వర్ణింపఁబడియె. నీతులు ధర్మంబు లందందు వర్ణితములు. మూఁడు, నాలుగైదంకములు చదువరులకు రక్తినొదవించును. విస్తర భీతిచే నతిమాత్రముగ గైకొనక స్థాలీపులాకన్యాయముగ రెండుపద్యములు మాత్రము మచ్చుచూపి విరమింపఁబడు.

1. నాల్గవయంకమున అగ్రజునియానతిని సీతాగ్నిప్రవేశము నకుఁ జితిఁబేర్చిన లక్ష్మణుఁడు తాను దోషినని దుఃఖపరితప్తుఁడై అగ్రజాజ్ఞాపరిపాలనము స్వధర్మముగాన దోషిని గాననియు దుఃఖింప రాదని చిత్తమును సమాధానపరచుకొనిన యీక్రిందిపద్య మత్యంత రమణీయము. ఇందలియుపమయు హృదయంగమము.

తే. గీ. చేతఁ గల్గుకృపాణంబుచేత నెన్ని
శిరముల న్గూల్పఁ గత్తి దోషి యగునొక్కొ ?
రామహస్తాసి యీసుమిత్రాసుతుండు
దోషి యెట్లగుఁ గైంకర్యతోషి గాక ?

2. నాల్గవయంకమున తన కగ్నిప్రవేశశిక్ష నిడినరాముని దూషించుటకు మారుగా నాతఁడు విధించినశిక్ష తనకు మహోపకారముగ భావించినసీతయొక్క యాత్మతుష్టి యిందుఁ జక్కఁగ వర్ణింపఁబడినది.

తే. గీ. కాంతిమంతమౌ నాయశఃకాయమునకు
నలముకొనినదుష్కీర్తిని ననలమందుఁ
గాల్చివైచిన ని న్నెంతకాల మైనఁ
బొగడవలెఁగాదె ! దూషింపఁబోలు నొక్కొ ?

చివుకుల వేంకటాచలశాస్త్రి,
శతావధాని,
శికిందాబాదు.

హాల్ మకాం కొత్తపట్నము
24-4-36

# ఈనాటకమున వచ్చు ముఖ్యపాత్రలు.

## 1 వ యంకము.

రావణుఁడు
శుకుఁడు
సారణుఁడు
శార్దూలుఁడు
విద్యుజ్జిహ్వుఁడు
జానకి
సరమ
రావణమాత
మాల్యవంతుఁడు

## 2 వ యంకము

శ్రీరాముఁడు
లక్ష్మణుఁడు
విభీషణుఁడు
సుగ్రీవుఁడు
కపి
అంగదుఁడు
రావణుఁడు
ప్రహస్తుఁడు
రాక్షసులు నలువురు

## 3 వ యంకము.

ఇంద్రజిత్తు
శ్రీరాముఁడు
లక్ష్మణుఁడు
హనుమంతుఁడు
సుగ్రీవుఁడు
విభీషణుఁడు
జానకి
త్రిజట
గరుడుఁడు
రావణుఁడు
సుషేణుఁడు
దీర్ఘదంష్ట్రుఁడు
వృశ్చికరోముఁడు

## 4 వ యంకము.

హనుమంతుఁడు
శ్రీరామలక్ష్మణులు
విభీషణుఁడు
జానకి
సుగ్రీవుఁడు
దశరథుఁడు

## 5 వ యంకము

విశారదుఁడు
గాలవుఁడు
హనుమంతుఁడు
భరతుఁడు
శత్రుఘ్నుఁడు
కృష్ణవర్మ
గోవిందవర్మ
శ్రీరామలక్ష్మణులు
జానకి
వశిష్ఠుఁడు

శ్రీ

# శ్రీ రా మ వి జ య ము



## —* నాంది *—

ఉ. శ్రీమిథిలాతనూజఁ జెఱఁజేర్చినరావణు నొంప మర్కట
స్తోమము గొల్వ లంక వెసఁజొచ్చి, హితంబు గ్రహింపకుంట, సం
గ్రామమున స్వబాంధవుని రావణుఁ దునిమియు సీతతో నయో
ధ్యామహనీయరాజ్యమును దాల్చినరాముఁడు బ్రోచు సభ్యులన్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ఘటితపుష్పాంజలియై ప్రవే
శించి సభ్యులపైఁ బూలు సల్లి)

సూ:- నటీ! ఇఁకనైనఁ గాలవిలంబన మొనర్పక సత్వరమ రమ్ము.
సభాస్తారుల కలకలము హెచ్చుట గ్రహింపకున్నావా?

నటి:- (ప్రవేశించి) ఇదిగో వచ్చితిని. సభ్యుల మనోగతం బిదమిత్థ
మని యెట్లెఱుంగనగు? ఆతురతవలనఁ గావచ్చును, సంతోషాతి
శయమువలనఁ గావచ్చును.

సూ:- ప్రేయసీ! గుణాగుణవిమర్శనంబున నెల్లపుడు చెడుగు నెంచి
మంచి నెంచుటయే సంప్రదాయము. ఏది యెట్లున్న నిఁక నాలస్య
కారణ మేమి కలదు?

న:- నాథా! పాత్రధారు లందఱు సన్నద్ధులై యేనాటకప్రదర్శన
మొనర్పవలయునో తమయాజ్ఞకై నిరీక్షించుచున్నారలు.

సూ:- సభాస్తారులు నాందీసూచనంబున కెంతయు సంతసంబువహించి
దానిఁ గాంచఁగుతూహాలు లయినట్లు కన్పడుచుండుట లేదా?
అది వారియుద్దేశమే కాఁబోలు.

న:- ఓహో! మనము ప్రదర్శింపవలసినది శ్రీరామవిజయమా?
పరమసంతోషము. దాని నేకవి రచించెను?

సూ:- సతీ ! ఏతింగించుచుండఁగనే యింతత్వరయా ?

సీ. విరచించెఁగాదె పల్వురు కవిశ్రేష్ఠులు వినుతించురీతిని 'విజయసింహ' ?
రచియించెఁగా సింగరాద్రివృహరిపేర రసయుక్తి శ్రీ'సింగరాద్రిమహిమ' ?
కృతిఁజేసెఁగాద పండితబృంద మలరార ససమ'శ్రీరామబాల్యప్రవాస' ?
మా మోదమున వ్రాసెఁగామృదుమధుర'రామోద్యోగము'ను సూరిహృద్యఫణితి ?

ఆ. నట్టిహారితగోత్రుఁ డాదూరి వేంకట
రంగనాథకవియె వ్రాసెఁ గాదె ?
రామవిజయదృశ్యరాజము నద్దాని
చేత సభను హృష్టఁ జేతుఁగాక.

న:- నాథా ! ఈకవి మనకుఁ జిరపరిచితుఁడే.

సూ:- నటీ ! ఇంతట నీ ప్రసంగముఁ గట్టిపెట్టి యుచితర్తువర్ణనముచే సభ్యమనోరంజన మొనగూర్పుము.

న:- చిత్తము.

గీ. నిర్మలంబులై సితములై నెగడునట్టి
తారకలఁ గూడి మిగుల మోదంబుఁ దెలుపు
నీలగగనంబు మించువినీలవార్ధి
కూలమున రామచంద్రుని లీలఁ గంటె ?

(తెరలో)

మ. అరరే ! యెవ్వఁడవోరి రాము శశిగాఁ నారీతిఁ గొండాడు నీ
వెరవున్నాడఁగ వింతగొల్పెడిని వేఁ వెంట న్దెగన్జూతె ? దు
ర్భరదోస్సారుని న న్నెఱుంగవటరా ? రంగన్మహోగ్రాసియో
శరమో పద్వెడి స్వామివైరి వగుని న్నాసించు నుగ్రాకృతిఁ.

న:- నాథా ! పదపద. రావణుఁడు మనోహరం బగుచంద్రవర్ణనములో రామచంద్రపదంబున ధ్వని పురస్కరించుకొని వైరిని గొండాడుచుంటిమని క్రుద్ధుఁడై కృపాణతూణీరపాణియై వచ్చుచున్నాఁడు.

సూ:- సరియే. (నటీసూత్రధారులు నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.

# ప్రథమాంకము



రావణుఁడు:- (కృపాణతూణీరపాణియై క్రోధోల్లసితమూర్తియై 'అరరే' యను పద్యముఁ జెవువుచుఁ బ్రవేశించి) ఏరీ! ఎవ్వరును లేరే? పారుఁబోతులు కంటి కగపడురా? (శుకసారణు లెడమటివైపు నుండి ప్రవేశింతురు)

శు. సా:- జయము జయము రాక్షససార్వభౌమునకు-

రా:- శుకసారణులారా! ఏమి మీయాకారములు! మీ పక్షము లేమైనవి?

శు:- ప్రభూ! ఏమిచెప్పుదుము? దేవరచే నాజ్ఞాపింపఁబడి మేము శ్రీరామసైన్యముల మాఱువేసములఁ గనిపెట్టఁబోయితిమి. కొంత వఱకు సంచరించితిమి. పోవఁబోవ శ్రీవిభీషణమహారాజుగారి కంటఁబడితిమి. ఆతఁడు శ్రీరామచంద్రుని సమీపమునకు మమ్ముఁ గొనిపోవుచుండ- అబ్బా! అబ్బా! తలఁచుకొనిన వడఁకుపుట్టు చున్నది- కనఁబడిన ప్రతివానరుఁడును గాలఁజేత మట్టగించి క్రీడా కందుకమువలె మమ్ము నలినులియొనర్చెను. బాబూ! ఇంతకుఁ బైన నేఁ జెప్పలేను. సారణుఁ డెఱింగించును.

రా:- ఆ! అట్లుచేసెనుగా? సారణా! తరువాత. తరువాత.

సా:- మహాప్రభూ! తరువాత శ్రీరామచంద్రుని సన్నిధానమునకుఁ బిలుచుకొనిపోయి నిలిపిరి. ప్రభూ! వైరియైన నగుఁగాక. ఆతని ప్రసన్నభావమును, గరుణార్ద్రహృదయమును, వర్ణింప నా వశమా? సగౌరవంబుగఁ జూచి విభీషణమహారాజును మాకు సర్వకపిభల్లుకసైన్యములఁ జూపి నిరపాయస్థితిని దమ్ముఁ జేరఁ బంపుమని చెప్పుచు సంధిఁజేసికొననియెడల రావణుని సబాంధ వముగఁ జంపుదుననియు లంకను సంద్రమున ముంచెదననియుఁ దమతోఁ దననుడిగాఁ జెప్పుఁడని చెప్పెను. అతనియనుజుని గాంభీ ర్యమును వర్ణింప మా కలవికాదు.

రా:- ఛీ ! సారణా ! వైరిగుణవర్ణనముఁదప్ప నేదైన విన సహింతు. జాగ్రత్త.

సా:- అట్టియసమానపరాక్రమశాలురతో నేటి కకారణవైరముఁ బెట్టుకొందువు ? ఆబలంబు లసంఖ్యాకంబులు, భయంకరంబులు. వానిని గాంచినమీఁదట మాకాళ్ళక్రిందిదు మ్మెగిరిపోవుచున్నది. ఏమొనర్తుము ? సంధిఁజేసికొనుటయే సర్వశ్రేయోదాయకమని మా యభిప్రాయము. అంతట నెల్లరును మమ్ముఁ జంప నుద్యుక్తులుకాఁగాఁ గరుణార్ద్రహృదయుఁ డగుశ్రీరామచంద్రమూర్తి మాపక్షంబులమాత్రము ఖండించి విడిచిపుచ్చుఁడని యాజ్ఞాపించె. చంపఁదగినయట్టిశత్రువును గనికరించి విడుచుట యాతనిమహోన్నతాశయమును వెల్లడించుట లేదా ?

రా:- శుకసారణులారా ! మీరు తినినదెబ్బలు మి మ్మిట్లు ప్రేలించుచున్నవి. రావణునిమనంబు ద్రిప్ప నెవరివశము ?

ఉ. భానుఁడు పుట్టుగా కపరపర్వతశృంగమునందు, వహ్నియే
పూనునుగాక శైత్యము, సముద్రము లొక్కటఁ బొంగుఁగాక, నేఁ
బూనుతలంపు మాన్పఁగనుబోలునె యెవ్వనికేని ? మానుఁడీ
మానవనాథుని న్పొగడుమాటలఁ జాటిమొనర్చువాఁడనే ?

పూర్వము మీ రొనరించిన మహాపకారములఁ దలపోసి విడిచిపుచ్చితిఁగాని యిట్లు మఱొకరు నా యెదుట వైరిని గొండాడిన భుజములమీఁదఁ దల నిలుచునే ? తొలఁగిపొండు. నాకడ మీ యధికప్రసంగముఁ గట్టిపెట్టి విద్యుజ్జిహ్వుని నొకతూరి యిటకుఁబంపుఁడు. వానితో నవసరకార్యము కలదు. సత్వరము పొండు.

శు. సా:- చిత్తము. మహాప్రసాదము. (నిష్క్రమింతురు)

రా:- శుకసారణులతరువాత వైరిసైన్యవృత్తాంతం బెఱుంగను, రామచర్యల, రామమంత్రివర్గంబును, నాతఁడు పరుండు వసతులు మొదలైనరహస్యముల నరసిరాఁ బంపఁబడిన శార్దూలుఁ డింకను

రాకున్నాఁడేమి ? ఈతఁడు తడయువాఁడు కాఁడే ? వైగులచేఁ జిక్కెనా యేమి ?

(తెరలో)

రావణప్రభూ ! శరణు శరణు.

రా:- (స్వగతము) ఎవరి దార్తనాదము ? శార్దూలుని కంఠధ్వనిగ నున్నదే ? (ప్రకాశముగా) దీనుఁడా ! అభయ మభయము. రాక్షసచక్రవర్తిని సమీపించితివి. నిర్భయముగ రమ్ము.

శార్దూలుఁడు:- (రక్తసిక్తాంగుఁడై ప్రవేశించి) జయము. జయము. రాక్షసచక్రవర్తికి.

రా:- శార్దూలా ! ఈరక్తసిక్తాంగత యేమి ? ఈతొట్రుపా టేమి ? ఈగద్గదస్వర మేమి ? వైరిపరిభూతుఁడ వైతివా యేమి? రామోదంతమును వారిసేనానాయకుల నెఱింగింపుము.

శా:- మహాప్రభూ ! వారు తన్నిసకాలితన్నులు, వారు అక్కనగంట్లు, నశనిపాతతుల్యంబు లగువారితాకులు కట్టెనుటఁ గాన్పింప నొక్కొకరిని వేర్వేఱ నెఱింగించువాఁడ. అవధారు. ఋక్షరజస్సునందనుఁ డగుసుగ్రీవుఁడు వానరసార్వభౌముఁడు. గద్గదసూనుఁ డగుజాంబవంతుఁడు భల్లూకలోకేశ్వరుఁడు. ధర్మపుత్రుఁడు సుషేణుఁడు. సోమసుజాతులు సౌమ్యదధిముఖులు. వాలియపత్య మంగదుఁడు. అసహాయశూరుఁడై లంకనెల్ల హుతాశనాహుతింబొనర్చినహనుమ పవమాననందనుఁడు. మైందద్వివిదు లశ్వితనయులు. గజగవాక్షగవయగంధమాదనులు వైవస్వతసంభవులు. మహాప్రభూ ! ఏమనిచెప్పను ? ఎవరికి వారు దుర్నిరీక్ష్యతేజోబలశాలురు. ఇఁక వీరల కధీశ్వరుల నెఱింగింతు. ఖరదూషణత్రిశిరస్సుబాహునిర్మూలనచణుఁడు రామచంద్రుఁడు, జనస్థానచతుర్దశసహస్రరాక్షసాంతకుఁడు, రఘువీరుఁడు. రాక్షసమాయాజ్ఞుఁ డగువిభీషణుఁ డాయసహాయశూరునకు దక్షిణభుజంబై తనరెడి.

ఉ. భీకరదీర్ఘబాహువునఁ బెద్దను, వాహుతిఁ గోరునాశుగా
నీకము గల్గునాదొన, యనింద్యపరాక్రముఁ డయ్యు, శాంతిభూ

పాకలితుండు రామనృపచంద్రుని, నాతనిమంత్రివర్గముఁ
బ్రాకటలీలఁ గాంచిన నరాతి యెవాఁడయిన న్వడంకఁడే ?

క. కనుఁగవ మిణుగురు లురులఁగ
జనితామర్షంబుచే నసాధ్యుం డౌ న
య్యనఘునియనుజుని లక్ష్మణుఁ
గనినంతన మిత్తి గనినగతిఁ బరతు రరుల్.

రా:- ఛీ ! వైరిని గొండాడవలదని యెంతచెప్పిన నటులనే పేరెలద వేల ? వానిఁగట్టిపెట్టి సంగతిమాత్రి మెఱింగింపుము.

శా:- మహాప్రభూ ! ఇది యతిశయోక్తి యేమాత్రము కాదు. ఈ కపినాయకు లెల్లరు యథేచ్ఛ నన్ను మర్దించి రక్తసిక్తాంగుఁడ నగున న్నాశ్రీరామచంద్రుని మోలకుఁ గొనిపోవ నే శరణు శరణంటిని. సహజకరుణార్ద్రహృదయుఁ డగునారాజేంద్రుఁడు నాభయము వాపి నన్నిటకుఁ బంపి యపాంగావలోకనమాత్రి కులీభూతాఖిలలోకుం డగునారఘువీరుఁడు తననిరీక్షణము లంక వైపునకుఁబఱపి నిర్భయముగఁ గోటఁజొచ్చుఁడని వానరానీకంబు నకు ముదలయిడె. లోకోత్తరవీరుఁ డగునాతని నెదిరి మ్రగ్గు టయో, జానకీదేవి నామహావీరునకు సమర్పించుటయో వానర వాహిని లంకఁ జొచ్చకముందె దేవరయే తేల్పఁదగినవిషయము.

రా:- శార్దూలా ! సీత నాతని కొసంగుమాట నీటిలోనిమూట. స్వప్నగతవృత్తాంతము. నీదారినఁ బొమ్ము.

శా:- చిత్తము. (నిష్క్రమించును. విద్యుజ్జిహ్వుఁడు ప్రవేశించును)

వి:- జయము జయము మహారాజుగారికి. సేవకుఁ డాజ్ఞకై వేచి యున్నాఁడు.

రా:- విద్యుజ్జిహ్వ ! నన్నిన్నిరోజులనుండి నిరాకరించుచుండిన సీత నొకకపటనాటకముచే వివాహమాడ నెంచితిని. నీరాక్షసమాయా సామర్థ్యమున శ్రీరామునిశిరశ్చాపంబులఁ గల్పించి సత్వరము తీసి కొని రమ్ము. నే నిదిగో యశోకవనమున సీతఁ గాంచఁబోవు చున్నాను. వానిఁగొని యచ్చోటికి రమ్ము.

వి:- చిత్తము. (నిష్క్రమించును)

రా:- (పరిక్రమించుట నటింపఁగాఁ దెర లేచును. అశోకవృక్షముక్రింద జానకీసరమ లుందురు) ఇదియే యశోకవనము.

గీ. నిరతదుఃఖతరంగసన్నిహిత యైన
సీత యీవనమందు వసించుకతన
శోకబంధుర మగుచు నశోకవనము
తలఁపఁగను నేతిబీరవిధంబుఁ దాల్చె.

సరమాద్వితీయయై సీత యాశింశుపావృక్షముక్రింద నాసీనయై యున్నది. చాటుననుండి యామెమనోగతంబు నెఱింగెద.

(చాటున డాగును)

జా:- కటకటా! మనోనాథా! అర్ధాంగియు, సహధర్మచారిణియు నగునాయెడల నింతటి నిష్కరుణయా? రావణుఁడు మాసద్వయావధి యొసంగి తన్ను వివాహమాడుమని బలవంతపెట్టుచున్నాఁడు. శీఘ్రమ రక్షింపవేయని భవదేకనిష్ఠ నెన్నిదినంబులు జపించినను జగన్మోహనంబగు మీసాక్షాత్కార మొసంగకున్నారుకదా? గడువుకూడ దరిసినది. సరమ నిన్న చెప్పుటలోఁ దాము నీరధికి వారధి బంధించి కపిభల్లుకసైన్యోపేతులరై వచ్చి లంకోత్తరతీరంబున సువేలాద్రిదరి విడిసియున్నారలని యెఱింగించె. సంతసించితి. (కనులు మూసికొని ధ్యాన మభినయించుచు)

గీ. నేను నీవాఁడనని పల్కనేని యొక్క
తూరి, రిపునైనఁ బ్రోచుదుర్వారదీక్షఁ
దాల్చునీవు త్వన్నామంబుఁ దలఁచుచుండు
నన్నుఁ బ్రోవనికతము కానంగఁబడదె?

ఆ. రామ రామ రామ రామ శ్రీరామ నా
మస్మరణమె సతము మానసంబు
నందు జపముసేయునట్టిన న్గావంగ
భారమయ్యె నొక్కొ? పరమపురుష!

(ప్రక్కనుండి రావణుఁడు ప్రవేశించి)

రా:- మ.భువనంబు ల్పదునాల్గుగెల్చి, క్రతుభుజ్ముఖ్యాళి మర్దించి, యా
శివశైలంబును బుష్పకందుకముగాఁ జేఁదాల్చు నన్నప్సరో
యువతీమానసచోరుఁ బ్రోవవుకదా? యోగ్యంబె యీవృత్తి? మ్రు
త్యువుపాలై తెగినట్టిరాముఁడు సమర్థుండౌనె నిన్బ్రోవఁగన్ ?

జా:- శ్రీరామ రామ. అమంగళము ప్రతిహత మగుఁగాక. ఎవఁ
డీవృథాశ్లీలప్రలాపి ? (కనులఁదెఱచి పరికించి) అక్కటా ! నా
యస్ఖలితధ్యానఫల మిా విధముగాఁ బరిణమించినదా ?

గీ. బాలచంద్రునిఁ గాంచఁగ లీల విచ్చు
కలువయిల్లాలు నెఱకన్నుఁగవను గేతు
నాగిఁ గనినరీతి, రామచంద్రుఁ గనఁగోరు
కువలయాక్షి దశాస్యకేతువును గాంచె.

ఇది ప్రారబ్ధకర్మఫలము. అనుభవైకవార్యము. (లేఁతగడ్డి
పోచ చేతఁదాల్చి) తృణమా ! ఏల యిట్లు వృథాశ్లీలముల
నాడెదవు ?

చ. భువనములెల్ల సంద్రమున మున్గి నశించునుగాక, యల్ల మే
రువు శకలంబులై సహజరోచులఁ గోల్పడుఁగాక, భానుఁడున్
శివుతలపూవు నాగగనసీమను బాసి నశింత్రుగాక, యా
రవికులవార్ధిచంద్రుఁ డగురామున కెన్నటికే నపాయమే ?

రా:- జానకీ ! నేఁజెప్పిన దించుకయు నసత్యము కాదు. రాముఁడు
సౌమిత్రిద్వితీయుఁడై లంకోత్తరతీరంబునఁ బథశ్రమచే సుఖనిద్రఁ
జెందియుండ మాయావు లగుమాచారులవలన నెఱిఁగి మామంత్రి
యగుప్రహస్తుఁ డేగి రామునినిద్ర దీర్ఘనిద్రగ మార్చి తచ్ఛిరశ్చా
పంబులఁ గొనివచ్చె. వానిని గొనితెచ్చుటకై విద్యుజ్జిహ్వునిఁ
బంపితిని. ఇంతకు వాఁడు వచ్చుచుండును.

(విద్యుజ్జిహ్వుఁడు ప్రవేశించును)

వి:- జయము జయము మహారాజుగారికి. శ్రీరామశిరశ్చాపంబు
లివియే.

రా:- ఇటు తెమ్ము (అందుకొని) జానకీ! ఇవి నీ నాథునిశిరశ్శాపంబు లగునో కావో గుర్తింపుము. (ఎట్టయెదుటఁ బెట్టును)

జా:- (భయవిభ్రాంతి నటించుచు స్వగతము) అక్కటా! ఏమిది కలయా నిక్కమా! ఈశిరశ్శాపములు నామనోహరునివే. సందియ మేమియు లేదు. హా ప్రాణనాథా! తొల్లిటిజన్మమున నేకన్యాదానము విఘ్న మొనరించితినో కాని సుఖానుభవయోగ్య యౌవనంబున నిట్టి యవాచ్యభర్తృవియోగము సంభవించినది!

చ. అలఘుపరాక్రమాన్వితుని, నగ్రకుమారుని, దండ్రియు,స్స్రజ
ల్వలచినధర్మశాసనునిఁ, బట్టముగట్టఁగరా దటంచు, ని
శ్చలముగఁ జెప్పి, దాన ధవుఁ జెంపితి,రాముఁడు నేఁడుపోయెఁగా!
కలకలనవ్వవచ్చు నిఁకఁ గైకరొ! పూర్ణముదంబుపెంపునన్.

క. తల తెగడీయవసరంబునఁ
జలియింపని సత్యవాక్యచణు లగువంశ
స్థులఁ జేరి గిక్కురై వడిఁ
దిలకించుచునుంటె త్వత్సతీదుఃఖంబున్?

గీ. సర్వశాస్త్రవిదుండవు సర్వకాల
విదుఁడ వగునీకు నీనిద్ర వింతకాదె?
భాగ్యహీననౌ నాదుపాప మనుమిత్తి
నిదురరూపున నిన్ను మ్రింగించెనేమొ?

(ప్రకాశముగా నేలవైపు చూచుచు) రాక్షసాధమా! పతివ్రత లగుసాధ్వులకు మనోవేదనఁ గల్పించుట నీకు వేడుకయా? నేను నానాథుని యనుచరిని గావున నీ భాగ్యహీనను బతిఁజేర్చి పున్నెముఁగట్టుకొమ్ము.

(స్వగతము)

క. దినదినము గంధకుసుమము
లను నే పూజింప నతివిలాసయుతంబౌ
ధను వీదుర్గతి, నిరతా
ర్చనపొనరుచుధవునిదుర్దశ గ్గంటి నయో.

నాకు భర్త్రనుగమనమే పరమసుఖదాయకముకదా ?
శ్రీరామరామా (మూర్ఛిల్లును)

సేవకుఁడు:- (ప్రవేశించి) జయము జయము మహారాజుగారికి. ప్రహ
స్తాదిమంత్రివర్గము తత్క్షణమ తమదర్శనము వేడుచున్నారు.

రా:- ఇదిగో వచ్చుచున్నాము.

సే:- ఇటు. ఇటు. (త్రోవఁజూప సేవకరావణులు నిష్క్రమింతురు.
శిరశ్చాపంబు లదృశ్యమగును)

జా:- (సరమ సేదదేర్ప నించుక తెలివిఁగని) హా నాథా ! వైవాహి
కమునాఁటిమాట మఱచితివా? అర్ధాంగిని, సహధర్మచారిణి నగున
న్నీదుర్భరదురంతవైధవ్యమహాంబుధి ముంచివైచి చేనుట నీకు
ధర్మమా ?

స:- తల్లీ ! జానకీ ! వగవకుము. క్రూరమాయావిదుఁడగు నీ రావ
ణునిమాటల నమ్మి యేలయశ్లీలంబుల నాడుకొందువు ?

ఉ. చేరల మించి పద్మదళచిత్రగతి న్స్ఫురణించుకన్గవన్
స్మేరముఖంబున న్నిజవశీకృతవానరభల్లుకావళి
న్గేరుచు లంకపైఁ గవియ నేర్పుచెలంగఁగఁ బ్రోత్సహించుసై
న్యారవము ల్వినంబడెడి నయ్యవె శాత్రవభీషణార్భటిన్.

(తెరలోఁ గపిభల్లుకనాదములు వినఁబడును)

క. క్షేమము శ్రీరామునకును
సౌమిత్రి కుపేంద్రయుక్తజంభారివలెన్
శ్రీమహితుఁడు రావణు సం
గ్రామమున న్దునిమి నిన్నుఁ గైకొను సాధ్వీ !

నాసామర్థ్యము నీకుఁ దెలియదు. నామాయ సర్వలోకం
బుల నజ్ఞాతంబుగ నవలీలఁ దిరిగిరాఁగల. శ్రీరామునివద్దకుఁ బోయి
యేదేని సందేశముఁ గొనిరమ్మందువా ?

జా:- నెచ్చెలీ ! సరమా ! ఈదీనురాలియెడ నీవు చూపినయవ్యా
జానురాగపురస్సరంబగు క్షేమోదంత మెఱింగియు నింకను సందియ

పడనేల ? నిస్సంశయము. నిస్సంశయము. నీసామర్థ్యంబున రావణునివద్ద కేగి యాతనియుద్దేశమేమో యెఱిఁగివచ్చి పుణ్యముఁ గట్టుకొనుము.

స:- జానకీదేవి ! ఇదిగో నీకోర్కెఁదీర్ప నిప్పుడే పోవుచున్నదానను.

జా:- చెలీ ! శుభమున నేగి రమ్ము.

స:- (పరిక్రమించుట నటింపఁ దెర లేవఁగా రావణ, రావణామాత్య మాల్యవంతు లుందురు. సరమ తెరప్రక్కన యుండును)

స:- (స్వగతము) అరుగో రావణ, రావణామాత్య, మాల్యవంతు లాలోచనాగృహాసీనులై యున్నారు. వీరిసంభాషణము రావణోద్దేశము నేమైన వెల్లడించునేమో చూచెదను. (మఱుఁగున నొదుగును)

రా. మా:- తనయా ! అరిషడ్వర్గంబునఁ జిక్కినరాజు క్రింతలు తెగిన వలవలె శత్రువర్గముపాలై మ్రగ్గునని యెఱిఁగి యెఱిఁగి, జనస్థాన చతుర్దశసహస్రరాక్షసానీకవృత్తాంతముతో ఖర, విరాధ, కబంధ, సుబాహుతాటకావృత్తాంతంబు నెఱింగి, చతుర్దశభువనైకాసహాయ పరాక్రముఁ డగుశ్రీరామచంద్రునిదేవేరిని గొనితెచ్చి యగ్నికణమును గొంగున ముడిచితివి. ఆసాధ్విని శ్రీరామున కప్పగించి సకలరాక్షసరాజ్యనాశంకరుఁడవుకాక శంకరుఁడవు కమ్ము.

మా:- రాక్షసేంద్రా ! నీమతంబునకు విరుద్ధముగాఁ గాన్పించినను నిష్పక్షపాతులకుఁ బ్రభుచిత్తానుసరణ మనావశ్యక మగుటను, ప్రభుహితముఁ గోరుటయే సచివధర్మ మగుటను నామనంబుఁ దెలుప సాహసించితిని. చతుర్ముఖదత్తవరంబునఁ దక్కటి సర్వసత్వములచే మృతినందకుండ వరంబందుటలో నల్పులని తలఁచి నర, వానర, భల్లూకములఁ గొఱఁతవెట్టితివి. వీరలచేత రాక్షసవంశనాశనము ధ్వనించుచుండుటయేకాక దానికిఁదోడు శివధనుష్షండనోదీర్ణభుజవిక్రమోపేతుఁడును, ధర్మకవచరక్షితుఁడును, వశీకృతారిషడ్వర్గుఁడును, నమానుషమహావిక్రమభూషితవాలిహననుం

డగుశ్రీరామచంద్రునితోడనే చివ్వఁగొంటివి. రోగికిఁ బథ్యము ప్రప్రథమమున నహితంబుగఁ దోఁచినను దుట్టతుదకు మహాహితమగు. కాలాకాలముల, బలాబలముల నెఱుంగక వైరిని డీకొన నెంచుట ప్రాజ్ఞులు చేయుత్రోవ కాదు. మారీచోపదేశము నొకపరి స్మరింపుము.

రా:- మాతా ! సచివాగ్రణీ ! మీ యొనర్చుహితంబులు నాచెవి కెక్కకున్నవి. శ్రమించి జానకినిఁ దీసికొనివచ్చినది తిరిగి శ్రీరామున కప్పగించుటకేనా ? చతుర్దశభువనజైత్రుఁడ నగునా కది యొకలోపము కాదా ? ఏమైనను గానిమ్ము.

ఉ. కోఁతుల, నెల్లుబంటులను గూడి భగీరథయత్నకృత్యమా
సేతువుమీఁద లంకదరిఁ జేరుట కాలునివీడు చేరిన
ట్లే తలపోయుఁ డిం కెచేటి కేగఁగలాఁడు శరీరయుక్తి ? ని
స్సీ ! తలవంపెకా ! వెఱపుఁ జెందెడినే మనుజాశనేంద్రుఁడుఁ ?

గీ. లంక మున్గిపోనిమ్ము జలంబులందు
దనుజసంతతితోడ స్వర్ధామమునకుఁ
బోవుదునుగాని యసువులు పోవువఱకు
జనకసుత వీడ నిజము, నిజంబు, నిజము.

మీరు శ్రీరామునిశౌర్యమునకు జంకినట్లు నే నానరాధమునకు జంకను. ఇఁక మీహితంబులఁ జాలించి వెడలిపొండు.

మా:- (స్వగతము) యుద్ధనిబద్ధబుద్ధి యగువీనియుద్దేశ మచంచలము.

గీ. ధర్మమూర్తియా కాలుఁ డధర్మనిరతుఁ
డైనవీనిగళంబున నట్టి పాశ
మును దగిల్చి యీడ్వంగనుబోలు వీని
నాపఁగలవాఁడె హరుఁడైన నడ్డ మేగి ?

(ప్రకాశముగా) ఇఁక మాకు సెలవు. పోయి వచ్చెదము.

రా:- సరియే.

రా. మా:- సర్వముఁ దెలిసినమూర్ఖునిమనంబుఁ ద్రిప్ప విధికినైన నసాధ్యము. ఎవరికర్మము వారిది.

(మాల్యవంతుఁడు, రావణమాత, రావణుఁడు నిష్క్రమింతురు)

స:- వెదుకఁబోయినతీర్థ మెదురైనట్లు రావణునిభావంబు విస్పష్టమయ్యె.

శా. స్త్రీలౌల్యంబున జానకి న్గొనుటచే శ్రీరామునిన్ వైరిగా
నేలా కొంటివటంచుఁ జెప్పనుడు లోకింతేని గైకొనక దు
శ్శీలుండౌచును గాలధర్మమున కాజి న్గోరు పీనింబలెన్
గాలాకృష్టత పశ్చిమాంతశిఖరి న్గన్పట్టు భాస్వంతుఁడున్.

ఈయుదంతము నారాకకై యెదురుచూచుజానకీదేవి కెఱింగింప సత్వరము పోయెద.

(సరమ పోఁగఁ దెర వ్రాలును.)



శ్రీ

# శ్రీరామవిజయము

## ద్వితీయాంకము.

(సువేలాద్రి — శ్రీరామ, లక్ష్మణ, సుగ్రీవ, విభీష, ణాంగదు లాసీనులై యుందురు)

శ్రీ:- అనుజా ! సౌమిత్రీ !

ఉ. పంకిలకర్ముఁడౌ ఖలుని బంక్తిముఖు న్ననుగొంట చాలదే
యింక నటంచు ? రక్ష్యము లెంతయుఁ బర్వఁగఁ జేసి రాముఁడున్
లంకను లెస్స చూచెడితలంపున వచ్చెడినంచుఁ బొంగి యా
పంకజబాంధవుం డపరపర్వతమంపు వెలింగి క్రుంకెడిన్.

సర్వధాతుసంకీర్ణం బగునీసువేలాద్రిపై నీరేయిఁగడపి రేపు వలువాత ద్యుమణిదర్శనముతో లంకను దేఱి చూతము. ఎట్టి వంశమునఁ బుట్టిన నేమి ? దుశ్చరితు్రిలు తా మవతరించినవంగడముఁ గళంకీభూత మొనర్చుటయేకాక వినాశహేతుభూతు లగుచున్నాగు కదా ?

గీ. జనభయంకర ఘోరక్రూరసర్ప మొండు
కలుగువల్మీకమును ద్రివ్వి కడమచిలువ
లన్నిటిని జంపరే ? యట్లె యఖిలలోక
కంటకునిచే నశించు రాక్షసచయంబు.

వీఁడొనర్చిన పరకాంతాపహారమహాపాతకకృత్యంబును స్మరించిన నాపాదమస్తకము భగ్గుభగ్గున మండుచున్నది. మఱియొక చక్కి పాపప్రాప్స్వీకృతాయుష్కుఁ డగువీనిచేఁతకు ఫలితముగ నీత నికి సదుపదేశ మొనరించి జానకిని శ్రీరామునకు సమర్పించి శరణు వేఁడుమని యీతని కెన్నివిధంబులనో నొక్కిచెప్పి దుశ్శీలుఁడగు

వీనిచే ననేకావమానములఁబొందియు స్వామిభక్తిని నాతని వీడ నొల్లనియనేకులు నిరపరాధుల నాదుర్వారబాణానలంబున కెర యొనర్పక తప్పనిసరివచ్చుచున్నదేయని యొకింతచింత వొడము చున్నది. కర్తవ్య మేమి? (ఇంచుక యాలోచించి తల పంకించి)

ఉ. మానిత మైనమందిరము మండెడిపట్లు గృహాధినాథుఁ డెం
తేని సమర్థతం బెనఁగుఁ డెంపున, సాధ్యముగాఁ బారఁడే?
దానవభర్త కెంతయు హితంబు వచించిన నొప్పకున్నచో
వానిని వీడనొఁ బ్రజ; శుభంబు గనం దలఁపున్న నిప్పుడే?

ల:- అగ్రజా! ఆశశినైపు చూడుము.

ఉ. కాలము దాటరామి నల కంజహితుండును బశ్చిమాబ్ధిలో
వ్రాలెను, లోకకంటకుని రావణు నాజ్ఞనొనర్చురీతి, భూ
పాలుఁడు రామచంద్రునకుఁ బట్టణము న్గనఁజేయురీతి నా
బాలశశాంకుఁడొప్పెడిఁ గృపాపరుఁడై యుదయాద్రిచెంగటన్.

శ్రీ:- సుగ్రీవవిభీషణులారా! తెల్లవారఁగనే మనసైన్యముల లంకా వప్రముచుట్టును గావలియుంచి లోనివారలను వెలుపలికి రాకుండ రాక్షససైన్యములపై దాడివెడలు నాజ్ఞయిడుము. పొద్దుపోయి నట్లు తోఁచుచున్నది. ఇంచుక విశ్రాంతిఁగొనుఁడు.

ల:- అగ్రజా! అర్కజా! నేనును విభీషణుఁడు నతిజాగరూకులమై కాపుందుము. తాము విశ్రమింపుఁడు. (శ్రీరామసుగ్రీవులు విశ్రమింతురు) విభీషణా! అసంఖ్యాకవానరభల్లుక సైన్యములతో జలధి బంధించి లంకఁజొచ్చి నిశ్శంకత నెదిరింపఁబోవు నసహాయ శూరుఁ డగుశ్రీరామచంద్రుని డీకొన నేసామర్థ్యమును నమ్మి రావణుఁ డింతటిమార్ఖ్యము వహించె? చిరపరిచితుఁడ వగునీకును నగోచర మగునా?

వి:- లక్ష్మణప్రభూ!

ఉ. తాటక నాసుబాహుని హతంబొనరించె నటన్న, దండకా
టోటరియైన యాఖరు సమూలబలంబుగఁ గూల్చెనన్న, ము

మ్మాటికిఁ దాటకాగ్రసుతుమాటలఁ ద్రోయుచు సీతఁ గొన్నయా
పోటుతనంబు మౌర్ఖ్యమును బోమెడినే విగతాసుఁ జేయకే ?

ఈపాపి జనించినకతంబున రాక్షసనాశనము చేకూరవలసి వచ్చుచున్నది. నే నెంతహితోపదేశ మొనరించితిని ?

చ. ఘనుఁ డొనరించునట్టిపని కాదిది యన్యునికాంతఁ గోరఁగా
వననొకొ ? దానవోత్కరము హాయిగ నుండఁగ నిచ్ఛయింపవే
యననొకొ ? జానకీసతి దయార్ద్రగుణుం డగురాముఁ జేర్పుమీ
యననొకొ ? ధాతవ్రాఁత నిసుమంత తొలంగఁగఁజేయ శక్యమే?

లః- విభీషణా ! ఇందు నీశక్తివంచన యించుకయు లేదు. మాకెల్లర కాసంగతి విదితమే. అయిన నీయొక్కనివలన సకలరాక్షసకుల నాశనము సంభవించుచుండెఁగదాయని యన్నగా రెంతో చింతిం చుచున్న ట్లున్నది. క్షమాగుణ ప్రధానుఁ డగునగ్రజునిశాంతగుణ మామూర్ఖుఁ డసమర్థతగాఁ బరిగణించుచున్నట్లు పొడకట్టెడిని. కానిమ్ము. ఎల్లి వా రేపథకముఁ ద్రొక్కఁదలంచిరో తేలునుగదా?

విః- రాజనీతిజ్ఞుఁ డగుసార్వభౌమునకు మనము చెక్కట్లు దిద్దఁదలఁచుట హనుమంతునిముందటఁ గుప్పిగంతు లగునేమో ?

లః- ఏమి ప్రాక్కాంత యప్పుడే యరుణదుకూలధారణ మొనర్చినది?

గీ. అమరవైరుల కనుకూలసమయ మగుటఁ
దనదువంశస్థునకు నహితంబు నగుట
నిచ్ఛయింపక మిముఁగన నేగుదెంచు
ద్యుమణికిరణంబు లన నరుణిమ యెసంగె.

విః- చ. ఎటుకలు రానివాని శయనింపుఁడటంచును బోతుపెంటులు
న్నటుచెడి నాల్గుదిక్కులను బక్షులు వే రవము ల్చెలంగ, వే
నెటుఁగఁబడె న్దశాస్యునకు హెచ్చరిక ల్వచియించువందు లీ
వటుకె యుపక్రమించుటను భానునియాగమనంబు తెల్లమై.

లః- అదిగో యగ్రజుఁడు చలించుచున్నాఁడు. సుగ్రీవుఁడు కదలు చున్నాఁడు.

వి. ల:- శ్రీరామచంద్రమహాప్రభువునకు జై (సాష్టాంగదండప్రణామము లొనర్తురు)

శ్రీ:- వత్సలారా ! మీరు బొత్తుగా నిదురింపనే లేదా ? దీర్ఘాయుష్మాన్భవ (లేతురు)

సు:- (లేచి) శ్రీరామచంద్రసార్వభౌమునకు జై (దండప్రణామ మొనర్చును)

శ్రీ:- చిరంజీవ. (సుగ్రీవుఁడు లేచును) వత్సలారా ! ఇంచుక ప్రొద్దు కలదు. సానుజుండనై కాల్యంబులఁ దీర్చివచ్చెద. ఇటనే యుండుఁడు. (శ్రీరామలక్ష్మణులు నిష్క్రమింతురు)

సు:- రావణుఁడు నవకోటి శివలింగముల ననుదినంబు పూజించునఁటకదా ? ఆనిదురబోతింకను లేవలేదా యేమి ?

వి:- పిచ్చివాఁడా ! ఆతఁడెప్పుడో మంగళతూర్యారావంబులతో మేల్కాంచి ప్రాతరాహ్నికంబులఁదీర్చి సూర్యోదయంబునకుఁ బ్రాసాదం బధిరోహించి సూర్యదర్శనమునకై రాఁగలఁడు.

సు:- అదిగో శ్రీరామచంద్రమూర్తి సానుజుండై సుస్నాతుఁడై

సు. వి:- శ్రీరామచంద్రమహాప్రభునకు జై (శ్రీరామలక్ష్మణులు ప్రవేశింతురు)

శ్రీ:- సుగ్రీవ విభీషణులారా ! కాల్యంబులఁ దీర్చి రండు. ఇంతలో ద్యుమణి యుదయాద్రి నారోహింపఁగనే లంకను దర్శింతము.

సు. వి:- మహాప్రసాదము (నిష్క్రమింతురు)

ల:- అగ్రజా ! చూచితిరా ? తెల్లవాఱుకొలఁదిని సముద్రఘోషతుల్య మగునినదముతో లంక తెరచాటుబొమ్మవలె నించుకించుక కానుపించుచున్నది.

శ్రీ:- అగును. అధర్మమార్గప్రవర్తకులు కాకుండిన వీరలఁ దేఱిచూడ నేరివశము ?

చ. అనవరతాగ్నిహోత్రపరు లంటకు నింగిని దాకుధూమమే
ఘనమగుసాక్షి, శ్రోత్రులనఁ గ్రాలెడి వేదనినాద మెల్లెడన్;
ఘనకృప, సత్య, శౌచములు కల్గమి గెల్వఁదలంపెకాని యి
య్యనఘులఁ దేఱిచూచుటకు నాసయె యాత్రితయంబె కల్గినన్?

ల:- అగ్రజా! జగ మన్యోన్యవిరుద్ధవస్తుసంకీర్ణమై యొకదాని నొకటి లయ మొనర్పనిచో బ్రహ్మకుఁ బునఃపునస్సృష్ట్యావశ్యకతయే యుండదు. లయకాలునకుఁ దీఱికయే యుండకుండునుగదా?

:- వత్సా! నిజము. నిజము. ఈ వేదస్వరూపమ త్తమాతంగంబులకు దయా, సత్య, శౌచరాహిత్యాంకుశమే లేకుండిన నిలువరింప నెవరివశము?

ల:- అదిగో సుగ్రీవవిభీషణులు కాల్యంబులం దీర్చికొని పరిశుద్ధులై వచ్చిరి.

సు. వి:- (ప్రవేశించుచు) జయము జయము మహారాజులకు.

శ్రీ:- సుగ్రీవ విభీషణులారా! ఇఁకఁ గర్తవ్య మేమి?

వి:- మహాప్రభూ! దేవర సౌహార్దంబున మమ్ములఁ బ్రుచ్ఛసేయుట యేకాని తమకుఁ గర్తవ్యము బోధింపఁగలుగుపాటివారమా? ఆలంకవైపు పరికింపుఁడు. నూఱామడ పొడవును, ముప్పదామడ వెడల్పు గలిగి వివిధోపవనభూషితమై యలరారుచున్నది. మన సైన్యపదఘట్టన దద్దరిల్లుచున్నది. కాంచితిరా? ఆయున్నత ప్రాసాదమే రావణహర్మ్యము. (విభ్రాంతుఁడై) అదుగో.

ఉ. చామరహస్తు లిర్గడల, ఛత్రము పైని వెలుంగ, హీరము
క్తామణిహారసంతతు లెద న్ఘృణు లీనఁగ మాషరాశినాన్
శ్యామశరీరుఁ డల్లడుగొ సౌధముపై వెలుఁగొందు రావణుం
డోమహనీయ! కాంచుము మహోగ్రుని నిర్జరకంటకాకృతిన్.

సు:- ఆనికృష్టుఁడేనా రావణుఁడు? సార్వభౌముసతిని దొంగిలితెచ్చి తనపట్టణమం దుంచి తగుదునని తలయెత్తుకొని తనపురిఁ గులుకుచున్నాఁడు. వఱువాత వీనిపాడుమొగముఁ జూడఁ దటస్థించినది,

(స్వగతము) వీని కించుక బుద్ధిగఱపివచ్చుట యుక్తమని తోఁచెడి (అని చివ్వని లంఘించును)

శ్రీ:- సుగ్రీవా ! సుగ్రీవా ! ఏమి నీయనాలోచితసంరంభము ?

ల:- అగ్రజా ! సుగ్రీవుఁడు మీరు వలదనునంతలోననే మింటికెగసి ఱెక్కలుగలపక్కివలె రావణుఁ డున్నగోపురముపైన లంఘించినాఁడు. చూచితిరా ?

వి:- ఎంతసాహస మెంతసాహసము ? తనయుద్దేశము మన కించుకయు నెఱింగింప లేదుకదా ?

శ్రీ:- అయ్యో ! ఎంతసాహస మొనర్చినాఁడు! ఎంతసాహస మొనర్చినాఁడు ! లక్ష్మణవిభీషణులారా ! అవసర మరుదెంచిన మీర లాతనికి సాయపడవలసివచ్చునేమో ? అచ్చటి విశేషముల నారయుచుండుఁడు. త్రిలోకాధిపత్యముసైతము శ్రీరామునకు సుగ్రీవక్షేమమువంటిది కాదు సుఁడీ ?

ల. వి:- చిత్తము.

ల:- అగ్రజా ! సుగ్రీవునిశౌర్య మేమనిచెప్పుదు ? కొంతవడి రావణునివైపు చూచి 'రావణా ! అసహాయశూరుఁ డగుశ్రీరామచంద్రుని దూతను. వానరనేత సుగ్రీవుఁడ. కాచుకొమ్ము' అని చెంగుమని యొక్కయెగురున నాతనిపైఁబడి శీర్షకముల నేలఁబడఁదన్ని హాహాకారిగఁ బోరుచున్నాఁడు.

శ్రీ:- బళిరా ! సుగ్రీవా ! అసహాయశూరా ! మగటిమియనిన నీదియేకదా ? తరువాత. తరువాత.

వి:- మహాప్రభూ ! అర్కజుఁడు శౌర్యముపెంపున రావణు నెత్తి నేలకు మొత్తినాఁడు.

శ్రీ:- సెబాస్. సెబాస్.

ల:- అగ్రజా ! అట్లు తన్నుఁ దాకుభానుజునిఁ జూచి యాపేరెలది యిట్లనుచున్నాఁడు.

క. ఇంతకు సుగ్రీవుఁడవై
సంతస మొనగూర్చినావు సఖులకు; నీకే నా
చెంతను విగతగ్రీవత
సంతస మొనగూర్చు దనుజసంఘంబులకున్.

(తెరలో శ్రీరామచంద్రమహాప్రభువునకు జై)

వి:- మహాప్రభూ ! రావణుఁ డీపలుకులు పలికెనో లేదో సుగ్రీవుఁడు విద్యుద్వేగమున నచ్చటినుండి యెగిరి సువేలాద్రిపై తెక్కలుగల పక్కివలె దుమికి మనకు నయనానంద మొనర్ప నరుదెంచుచున్నాఁడు.

ల:- చేతఁ జిక్కినపక్షి యెగిరిపోవ నద్దెవెపు దీర్ఘదృష్టిఁజూచు వ్యాధునిపగిదిఁ దమబుద్ధిహీనతకును సుగ్రీవునియనుపమానజవంబునకును రావణుఁడును దక్కిన దనుజబృందమును షుక్కుపై వ్రేలిడికొని యచ్చెరువొందుచున్నారు.

(తెరలో) శ్రీరామచంద్రమహాప్రభువునకు జై. (సుగ్రీవుఁడు రక్తసిక్తాంగుఁడై ప్రవేశించును.)

సు:- (శ్రీరామునకు నమస్కరింపఁబోవ బిగ్గఁ గవుంగిటఁజేర్చి)

ఉ. సేమముగాఁగ వచ్చితివె సిగ్గును బాసి ? యహస్కరాత్మజా !
యేమని రావణాసురుని నెంచి తెగించితి వేకతంబ సం
గ్రామ మొనర్ప? వాఁడు నినుఁ గాఁజియవెట్టిన నేను మందునా?
యేమిటి కిట్టిసాహస? మిఁ కెన్నఁడొనర్పకు మిట్టికృత్యముల్ ?

నీయట్టి మిత్రతముఁడే పోయిన నాకిఁక నేరితో నేమిపనియున్నది? విభీషణునికి లంకారాజ్యమును భరతునకయోధ్యారాజ్య మప్పగించి నిన్ననుసరింప సంకల్పించితిని. అయ్యో ! నీదేహ మిట్లు రక్తసిక్తమైనదే ? ఎంత నొచ్చితివి ?

సు:- మహాప్రభూ ! సార్వభౌములును మిత్రవరేణ్యుల రగుమీధర్మపత్ని నపహరించిన పాడుమొగంబుఁ జూచినంతనే కోపోద్రేకమున

నట్లొనరించితి. నే నీమొగమునకుఁ జిక్కుదునని తలంచితిరా? మీయాజ్ఞకై నిరీక్షించుచున్న కింకరుల కేమియాజ్ఞ?

శ్రీ:- సుగ్రీవ, విభీషణ, సౌమిత్రులారా! కాంచితిరా శకునములు?

చ. ఘనము లుదీర్ణఘోషమునఁ గ్రక్కెడి శోణితధార, భాస్కరుం
డనలముఁ గ్రుమ్మరించెడిఁ గటా! యవె జంబుకనిస్వనంబులు
న్వినఁగుచుండెఁ, బక్షులు ధ్వనించెడి దీనరుతంబుతోడ, మిం
టను రవి మాసె, నయ్యుడుగణంబునఁ దోఁచెడి ధూమకేతువుల్

సర్వశకునములు జననాశనసూచకంబులుగాఁ గాన్పించుచున్న వేకాని వేఱు కావు. దైవనియతి యనివార్యముకదా? విచారించి చేయఁదగున దావంతయుఁగాన్పింపదు. ఇఁక నాలస్యము సలుపఁజనదు. లంకను దక్షణము ముట్టడింతము. సుగ్రీవా! పూర్వద్వారము నీల, ద్వివిద, మైందులను, దక్షిణద్వారము గవాక్ష, ఋషభ, గవయ, గజయుతుఁడుగ నంగదుని, బశ్చిమపథము ప్రఘస, ప్రమాథసమన్వితంబుగ మారుతిని బోఁ్రచునదని రామాజ్ఞగాఁ దెలిపి, కడుజాగరూకతతోఁ గావ నాజ్ఞనిడుము. ఉదీచిని నే నిలిచెద. కోటచుట్టును గోట్లకొలఁది కపివీరుల ముసురు కొనఁజేయుము.

సు:- మహాప్రసాదము. ఆజ్ఞయిడి యిప్పుడ వచ్చెద.

(నిష్క్రమించును)

శ్రీ:- సర్వసైన్యములు నాయాన లంక ముట్టడించుచున్నవి. వైరి యెంతటినికృష్టుఁడైనను రాజధర్మము సంభావనీయముకదా?

(సుగ్రీవుఁడు ప్రవేశించును)

సు:- జయము. జయము. శ్రీరామచంద్రసార్వభౌమునకు. దేవా! దేవరయాజ్ఞానుసారము లంక ముట్టడింపఁబడినది. ఇఁకఁ గర్తవ్యము.

శ్రీ:- సుగ్రీవా! అంగదు నొకసారి పిలిపింపుము.

సు:- మహాప్రసాదము. ఏవఁడురా అక్కడ?

కపి:- (ప్రవేశించి నమస్కరించి) జయము. జయము మహారాజులకు
ఏమియాజ్ఞ ?

సు:- అంగదుని సత్వరమ పిలుచుకొనిరమ్ము.

క:- చిత్తము (నమస్కరించి నిష్క్రమించును) అంగదుఁడు ప్రవే
శించును)

అం:- జయము జయము మహాప్రభువులకు. (సాష్టాంగదండప్రణామ
మొనర్చి లేచి) ఏమి యాజ్ఞ ?

శ్రీ:- అంగదా! ఈతత్క్షణమ రావణుఁజేరి నాయొసంగునీహితలేఖ
నాతని కొసఁగిరమ్ము. (అందించును.)

అం:- ( కనుల కద్దుకొని ) మహాప్రభువుల యాజ్ఞానుసార మిదియే
పోయివచ్చెద.

శ్రీ:- సత్వరమ రమ్ము.

అం:- చిత్తము.

(శ్రీరామ, లక్ష్మణ, సుగ్రీవవిభీషణులు నిష్క్రమింతురు.
అంగదుఁడు పరిక్రమించుట నటింపఁ దెర లేవ రావణప్రహస్తు
లుచితాసనాసీనులై యుందురు)

రా:- (ఠీవిగా) ప్రహస్తా! ఎవఁడీకోఁతి మరల వచ్చినాఁడు ?

అం:- రాక్షసేశ్వరా ! శ్రీరామచంద్రప్రభు పరాయబార మీ
కమ్మలో వ్రాసె.

ప్ర:- దానిని నీవే చదువుము.

అం:- రావణేశ్వరా ! అవధారు. దానికి ముందు కొన్నినామాటల
వినుఁడు.

చ. అనుపమబాహుశక్తి దనుజాంతకుఁడై,నినుఁ జంకఁగొంచు నా
వనధులఁ ద్రిప్పినట్టియలవాలిని నేకశరంబువాత వేఁ
దునిమినరామభూమిపతిదూతను వాలిసుతుండ నంగదుం
డను, మనుజేంద్రుపల్కుల నిట న్వినిపించెద నాలకింపుమీ.

క. నేరిచియో నేరకయో
నేర మొనర్చితివి సాధ్విని న్దొంగిలి య
వ్వారిజనేత్రను రామునిఁ
జేరిచి శర ణనుమ దానఁ జేకురు శుభముల్.

అటు లొల్లవేని కోదండరాముని న్యాయనిష్ఠురవాక్యంబుల విందువుగాక.

రా:- ఈ కీశాధమునివాక్యములతోఁ గాలయాపన మేల ?

ప్ర:- అంగదా! రామవాక్యములే చదువఁబడుఁగాక. నడుమ నీయధిక ప్రసంగ మెందులకు ?

అం:- అయినఁ జదువుచున్నాఁడ. సావధానులరై వినుఁడు.

ఆ. ఏబలంబు లోన నెంచి యచ్చరచాన
గమిని బందిఁజేసి కటిక వగుచు
మునిచయంబుఁ గష్టములఁబెట్టినాఁడవో
యాబలంబుఁ జూప నదనె యిదియు.

రా:- (వికటహాసముతో) చూపుటకు సిద్ధపడియే యున్నాఁడఁగదా ? తినఁబోవుచుఁ గూరాకురుచి నడుగనేల? ఆ. తరువాత

అం:-ఉ.రా జొనరింపఁగాఁ దగనిరాణ ధరాసుతఁ దస్కరించి యా
వ్యాజముచేత రాక్షసకులాంతము నేటికిఁగూర్తు వోరి ? ని
స్తేజ! బలంబు కల్గినను జేయుము సంగర ; మట్లుకానిచో
భూజనుఁ దెచ్చి మచ్ఛరణు పొందుము మేలగు నీకు దీనిచేన్.

రా:- ఓహో ! రాక్షసకులాంతమో కపి, భల్లుక, నరసైన్యాంతమో యెఱుంగఁడు పాపము! ధరాసుతఁ దస్కరించుట రాజానర్హమనెనుగదా ; తెచ్చినదానిని గొనిపోవుట రాజార్హమనియు నది తనవంతౌయెననియు నను.

అం:- చ. కుజనుల వీడి సజ్జనులఁ గూడెడివారలు గాంత్రు సత్ఫల
వ్రజ మనఁగా విభీషణుఁడు పాపుని ని న్విడనాడి నన్నుఁజే
ర జగము మెచ్చ రాక్షసధరాభరణం బిడినాఁడ వాని క
క్కజముగ నిన్ను ద్రుంచి చెలికారము కూర్చినయప్పుడీశ్వరా

రా:- (ఉగ్రుఁడై) ఏమీ! ఎంత కండకావరము! విభీషణునకు రాక్షస రాజ్య మిచ్చెఁగా! చతుర్దశభువనజైతుఁడ నగున న్నేమని తలఁచెనో? ఆ. తరువాత.

అం:- ఆ. పక్కివయి త్రిలోకపర్యంత మేగినఁ
జేవఁ దక్కి, కాలుఁ జేర్చు నిన్ను
రామబాణ మద్దిరా! వృథాశ్రమమెకా!
నామబారిఁ బడి, చనంగ లేవు.

రా:- అగును. తండ్రి వెడలఁగొట్టఁ జెట్టుచెట్టు గుట్టగుట్టఁ దిరుగుచు గుంటకు గ్రుక్కెఁడునీళ్ళఁ దాగుచు భార్యను గోలుపోయిన యక్కుపక్కివెమట నేను జేవఁదక్కినపక్కినిగా కేమగుదును? అట్టిరామబాణ మిప్పు డెచ్చట దాగినది? ఆ. తరువాత.

అం:- గీ. నీకు మృత్యువు సిద్ధ మేపీకఁ జనిన
సర్వసుఖములఁ గని, పైని సంగరంబుఁ
జొచ్చుమీ; వీరపురుషులు చూఱఁగొనెడి
పథముఁ గనఁజేతు మచ్చరపంక్తిఁ బొదివి.

రా:- (మహాక్రోధమునఁ గత్తి దూసి) ఏమికాఱులఁ బ్రేలెను? నాకు మృత్యువు సిద్ధమా? తా బ్రదుకువాఁడును నేఁ జచ్చెడివాఁడనా? కాని మ్మదియైనఁ దేటపడును.

అం:- దానవేశ్వరా! ఆశూరాగ్రేసరుని రాయబారపువచనంబు లివియే. అయినను నీహితముఁగోరి వచించునాకడపటిమాట వినుము.

గీ. ఒక్కమాటయు, నొకశర, మొక్కపత్ని
కలుగునవ్వీరువచనంబు కాదు మిథ్య
వనచరేంద్రునిఁ జేయఁడే వాలిఁ జంపి
యనుజు సుగ్రీవు? నదియైన నరయుమయ్య!

గీ. కులగిరులు క్రుంగి గగనంబు కుతలముపయిఁ
బడఁగవచ్చునుగాని యప్పురమపూజ్యు

శౌర్యశాలిసంకల్ప మసత్య మగునె ?
మేల చెడ నెంచెదవు నాదుహితము వినుము.

రా:- ప్రహస్తా ! ఇంకను జూచెదవేల ? ఈపెద్దలరిపెడ ఱెక్కలు విఱిచికట్టి కొట్టి చంపుఁడు.

ప్ర:- చిత్తము. ఎవఁడురా అక్కడ ? (నలువురు రాక్షసులు ప్రవేశింతురు)

రాక్షసులు:- జయము జయము మహారాజుగారికి. ఏమిసెలవు ?

ప్ర:- ఈమర్కటుని బంధించి కొట్టి చంపుఁడు.

1 రా:- ఓరికోఁతీ ! ఆజ్ఞ వింటివా ? రమ్ము.

అం:- (స్వగతము) వీరికిఁ జిక్కినట్లు నటించి యీ నలువుర యమాలయాతిథుల నొనర్చి యేమఱుపాటున వియన్మార్గంబున నెగసి శ్రీరామచంద్రునిఁ జేరవలయు. (ప్రకాశముగా) మీచేతఁ జిక్కితిఁగదా ; మీ యిష్టము.

2. రా:- (నిష్క్రమించి తాళ్ళతోఁ బ్రవేశించి) పట్టుకోండొ ! కట్టాం (మువ్వురు పట్టుకొని యొకఁడు కట్టఁబోవఁ బట్టుకొనిన వారిని జంకక్రింద వేసి నలిపి కట్టువానినిఁ దన్ని యెగయును)

ప్ర:- (ఆశ్చర్యము నభినయించుచు) ఏమివిచిత్ర మిది ! వీనిబల మే మోకాని యేనుఁగులవంటి యీ నలుగురు రాక్షసులు పీనుఁగులై కూలినారు. ఆహాహా ! ఱెక్కలుగల పక్షివలె నెగసి యదృశ్యుఁడయ్యె.

రా:- ప్రహస్తా ! అంగదుఁడు సామాన్యుఁడా ! వాలి పుత్రుఁడు. మహాబలసంపన్నుఁడు. ఇందాశ్చర్య మేమున్నది ? (చప్పరించి తలపంకించి) విధి దుర్నివార్యము. రాక్షసబలంబు లతిజాగరూకత వానరబలంబులు లోనఁజొచ్చకుండఁ గాపాడునదనియాజ్ఞ. ఆనరాధమునిఁ దాక నిందరజిత్తుఁ బొమ్మని యాజ్ఞ.

ప్ర:- మహాప్రసాదము. (యవనిక జాఱును)



శ్రీ

# శ్రీరామవిజయము



## తృతీయాంకము.

(లంక-యుద్ధభూమి. పటాక్షేపముతో నింద్రజిత్తు ప్రవేశించును)

ఇం:- ఓవిధాతా!

చ. అతిరభసంబున న్వడలి ఆగక తాకినసోకుమూకల
న్వెత నిడురామబాణతతి వెంటఁ బడ న్గడుబైసిమాలి ని
గ్గతరుధిరప్రవాహముల రంగ దరాతులు చూచి నవ్వఁజే
వ తఱుఁగ వీరదానవుల స్వామికి నీకృతిఁజింతఁగూర్చెదే.

మ. తెగువ న్సర్వసుపర్వసంఘముల నార్తిన్బొందఁగాఁజేసి, మి
త్రగణం బౌనన,దండిసంతసముఁబొంద న్గీర్తిఁ జేకొంటి మున్
సిగపూవాడక నిర్జరేశ్వరుని నాజి న్బట్టితింగాని నేఁ
డుగదా శాత్రవబాణవృష్టిహతు నిట్టు ల్బాచునే! ధాత నన్.

ఉ. పోలెను సైన్యము, ల్నిలువఁ జోటు లభింపదె? యెత్తునట్టి వి
ల్లేల నమర్చులోనె శకలీకృతమా రిపుచేత, సారథి
న్దూలఁగఁజేయు, రథ్యముల నుగ్గొనరించెడిఁ గట్ట! రామభూ
పాలకతత్సహోదరుల బాణపరంపర నిల్వ శక్యమే?

రణంబున మారణధర్మంబుదప్ప రణధర్మంబుఁ బాటించురాజులకు జయము కడుంగడుదూరము. ఈనరకంఠీరవుల ముఖాముఖి నెదిరించి గెలుపుఁగొన నెరికిని సాధ్యముకానేకాదని బుద్ధికిఁదోఁచెడిని. ఇంద్రజిత్తునను బిరుదమువహించిననే నీమానవుల నోటువడి

లంక నడుగిడవలసినదేనా? కల్ల. కల్ల. ఇది యెన్నఁటికిని బొసఁగదు.

క. పరువడి లక్ష్మణు నాజిం
 బొరిఁగొని నను గాంచవచ్చుఁ బుత్త్రం డని న
 న్నరసెడిజనకుని మొగ మె
 త్తెఱఁగునఁ దిలకింపఁగలను దెలతెలవోవఁ ?

ఇందులకుఁ బ్రతీకార మేమి? ప్రస్తుతకర్తవ్య మేమి? (యోచించి తల పంకించి) ఆ. మంచియుపాయము తోఁచినది. నే నదృశ్యగతి మేఘంబులమాటున డాగి యీనరపాలురమీఁదను సర్వకపిభల్లుకసైన్యములమీఁదను నాగాస్త్రప్రయోగ మొనర్చి వివశుల నొనర్చెద. (పరిక్రమణము నటించును.) (తెరలో)

చ. మగఁటిమిగల్గినన్ ధృతిని మార్కొని కార్ముకవిద్య నేర్పుఁ బె
 ల్లుగఁ బ్రకటించి మార్తురను లొంగఁగఁజేయుటొ లేక లొంగియో
 గఁగఁదలపెట్టుటో తగునుగా కిటు పిక్కబలంబుఁ జూపి వె
 న్నఁగనఁగఁజేతె వైరుల కనూనపరాభవ మన్న వేఁటకో ?

ఏమీ రామునికావరపుఁబోటుమాటలు? నేఁ బరువెత్తుటఁ జూచి పారఁబోతునని నన్నధిక్షేపించుచున్నాఁడు. కానిమ్ము. వీనికిఁ బ్రత్యుత్తరము మత్ప్రయుక్తనాగాస్త్రమే యొసఁగఁగలదు.

గీ. ఉస్సురని యూర్చుకొనుచు నన్నుగ్రశాత
 బాణముల ముంచుమిమ్ములఁ బరమకోప
 మునను బెనఁగొని యసువులఁ గొనెడిఁగాక
 నాగబాణంబు రిపుభయానకముఖంబు.

(అస్త్రప్రయోగము నటించి పారఁజూచి) నాగబంధంబులచేఁ గట్టువడియు నరువడిన నన్వెన్నంటివచ్చునది శ్రీరాముఁడు, నాతనితమ్ముఁడు లక్ష్మణుఁడే. భయమగుచున్నది. నే నాలసింపక మేఘములమాటున డాగవలె. (ఇంద్రజిత్తొకవైపున నిష్క్రా

మించుచుండ వెనుకటి వైపునుండి నాగపాశబద్ధులై శ్రీరామలక్ష్మణులు ప్రవేశింతురు)

శ్రీ:- ఛీ ! పాఱుఁబోతా ! మాయావిద్యావిశారదా ! ఇదియా నీ పౌరుషము ?

ఉ. పోటరినంచు, స న్నెదిరి పోరఁగలాఁడ నటంచుఁ దండ్రితోఁ
జాటి వచించి వచ్చి యిట సంగరరంగమునందు సుక్కి, పే
ర్లోటమిఁ జెంది చచ్చినటు లుండక పాఱుచుఁ బాఁపకట్టుల
న్మోటవలె న్వెనర్చి యెటుపోయితి వోరి త్రపావిహీనుఁడా !

చ. సమముగఁ బోరి గెల్వఁగఁ బసందగుఁగా కిటు కానరాక మే
ఘములను దూరి సర్పములఁ గట్టుట యా మగబీర ? మిట్టియ
క్రియ మది యేల ? వెన్నరులకంటికిఁ జూపిననిన్ను, భీతు బా
ణముల నలంతునంచును మనంబున నెంచితె ? సారహీనుఁడా !

ల:- ఓరీ ! ఇంద్రజిత్తా !

క. పఱగిడెదె ? పాఱుఁబోతా !
సురపత్యరి ! నిలువు నేఁడు చూడంబడియెన్
దురమున నీసాహస మి
త్తెఱఁగేనా ? మఱుఁగుఁ జొచ్చితే ? కపటాత్మా !

శ్రీ:- (నాగబంధంబులఁ దెంపఁ బ్రయత్నించుచు) అబ్బా ! అబ్బా! ఈనాగబంధము లెంతదృఢముగఁ జుట్టుముట్టి చుఱుక్కు చుఱుక్కు మనుచు రక్తపానముఁ జేయుచు స్మృతిఁ దప్పఁజేయుచున్నవి ? బాణప్రయోగముసైత మరికట్టినవే.

ల:- ఆహా ! అపజయమన నెట్టిదో యెఱుఁగని యగ్రజునికి నాకు నీ సర్పబంధంబు లెక్కడ దాపరించినవి ? ఇది కర్మఫలముగఁ దోఁచుచున్నదికాని యింద్రజిత్తు శక్తియేయని యేమాత్రము తోఁచుట లేదు. అబ్బా ! దుర్భరము. దుర్భరము. ఈబాణపరంపర ఱెక్కలుగల పాములపగిది మర్మభేదనం బొనరించుచు నిలువఁగూడ శక్తిహీనముగ నొనర్చుచున్నవి. (తూలుచు) ఇఁక నేమాత్రము నిలువఁజాల.

శ్రీ:- అబ్బా ! అబ్బా ! కడుభరంబుగ నింతదనుక నిలువరించితిఁగాని యాపాదమస్తకము నీపాపములుకులవలని శోణితధారలు పర్వతమునలువంకలఁ బారునిర్ఝరములభంగి స్రవించుచున్నవి. (తూలుచు) (తెరలో)

ఉ. పేర్చెద రేల కాఱుల ? బిభీషికలా ననుఁ దాకి పోరుటల్
కాలము తీఱె సంగరముఖంబున నాగశరాళిఁ జిక్కి పోఁ
జాలరు వీరు లేరయినఁ, జాలినఁ జాలఁగవచ్చుఁ బ్రాణము
లూఁకలు మీరలా యెదురఁగోరుట రావణిబాణపావకున్ ?

(మత్తుఁదేఱి యాశ్చర్యకోపముల నభినయించుచు) ఏమిరా పేర్చెదరి ! నీ ప్రగల్భములు ? మగబీరంబులఁ బల్కుచుఁ బోటుమానిసివలెఁ దలయెత్తి తగుదునని తిరుగుచున్నావు ? నీ శౌర్యమున కాపశుబలయుక్తుఁ డగునీతండ్రియు, నధర్మప్రవర్తకు లగు మీతోయమువారు మెచ్చుకొనవలసినదేకాని రణధర్మవిదు లెవ్వరుఁ బ్రశంసింపరు. ఇంతకుఁ గాల మనివార్యము. విధి బలీయము. ఇంచుక సేదదేఱెద. (మూర్ఛిల్లును)

ల:- అక్కటా ! అగ్రజా ! మేరుధీరుఁడ వగునీవు మూర్ఛిల్లితివా ? ఇఁక మాకు దిక్కెవ్వరు ? అబ్బా ! అబ్బా ! ఈ బాణబాధ దుర్భరము. హా ! (మూర్ఛిల్లును) (తెరలో నింద్రజిత్తు)

ఉ. పొండిఁక రామలక్ష్మణులు పోర మృతిం గనిరంచు దానవా
ఖండలుతోడఁ జెప్పి, యొడికంపుబహూకృతు లంది, భూమిజా
తొండజయాన నాజనకు నర్మిలిఁ బెండిలి యాడురీతిఁ జే
యుం; డిట నుండనేల సమరోర్వి జయేందిర నన్వరింపఁగన్ ?

(హనుమంతుఁడు ప్రవేశించును)

హ:- ఈపాఱుఁబోతును మాయావియునైన యింద్రజిత్తు కపిభల్లుకసైన్యములఁగూడ నాగపాశవశులఁజేసి నేలకుఁ గోలకుఁ దెచ్చి ఈమోదేశంబున నేమేమో వాపోవుచు లంకాభిముఖుఁడై చనుచున్నాఁడు. మాజానకీరాముఁ డేఁడి ? (నలుదిక్కులు పరికించి)

అక్కటా ? ఏమిది ! కల కాదుగదా ? అసహాయశూరు లగు శ్రీరామలక్ష్మణులుసైత మీ నాగపాశంబులఁ జిక్కినారుకదా ? ఏమి కాలవైపరీత్యము ? (సుగ్రీవవిభీషణులు ప్రవేశింతురు)

సు:- పావనీ ! ఏమి యీ విపరీతము ?

హ:- స్వామీ ! ఏమి చెప్పుదును ? విధి యలంఘ్యము. వీరు మూర్ఛితులైన ట్లున్నారు.

వి:- సుగ్రీవా ! నాయాస లన్నియుఁ జేరాసలగున ట్లున్నవే ?

హ:- ప్రభువులారా ! యుద్ధంబున మూర్ఛఁజెందుట సహజమేకదా? దానినిబట్టియే జయాపజయంబుల నిర్ణయింప శక్యమా ?

సు:- సేనలన్నియు నీయింద్రజిత్తుఘాతకుఁ గలగుండువడిన ట్లున్నవి. మనము వారిని బురికొల్పవలె. మారుతీ ! శ్రీరామలక్ష్మణులు మూర్ఛ తేఱువఱకు నతిజాగరూకత రక్షించుచుండుము. మే మింతలో వత్తుము. (సుగ్రీవవిభీషణులు నిష్క్రమింతురు)

హ:- క. శివధనువు విఱిచి, యింద్రజు
నవలీల స్తునిమి, యలఖరాదులఁ దృటిలో
బవరమునఁ దృంచి మించిన
యవనీశ్వరు నిట్లు చూడనయ్యెనె ? యకటా !

నాగపాశబంధంబుల వివశులై యున్నను వీరి తేజం బించుకయుఁ దఱుఁగకుండుటఁజేసి మూర్ఛిల్లియే యున్నారలని తోఁచెడి. ఏది యెట్లున్న నీస్వాముల నతిజాగరూకత రక్షించుచుండెద. (చుట్టు పహారాయిచ్చుచు) 'రఘుపతి రాఘవ రాజారాం - పతితపావన సీతారాం' (అని భజనచేయుచుండును) (తెరలో)

గీ. రామసౌమిత్రులను రణరంగమునకు
బలిరొసంగినయింద్రజిత్ప్రాభవంబుఁ
జాటుఁ డెల్లెడ జయజయశబ్దములను
జయపతాకంబు లెల్లెడ సంచలింప.

హా:- (ఇంచుకకోపముతో) పడుఁడు మీాపాటు. ఎంతకాలము లే పోటుఁగనినసముద్రము పాటుఁగనదా ? విధినిర్ణీత ములంఘ్యము కదా ? (తెరలో)

గీ. రామసంస్మరణమున నిరంతరంబు
మునిఁగి ననుఁ జిల్లిగవ్వగఁ గనురమణికిఁ
బుష్పకంబునఁ జూపుఁడు పొలికలనిని
భర్తృమృతిఁ గాంచియైన న న్వలచు నేమొ ?

హా:- (కోపమునఁ బండ్లు పటపటఁగొఱుకుచు) ఓరీ దుర్మదాంధా ! బ్రహ్మవంశచండాలా ! పరకాంతాలోలా ! అనుక్షణము పతి వ్రతాక్షోభంబునఁ గుృంగుచున్ననీయాయువు స్థిరమని పోకలు పోవుచున్నావు. మానవేశ్వరుని మూర్ఛఁ దెలియనిమ్ము. నీయీా వాక్యములఫలితము వేయురె ట్లనుభవింపఁగలవు. ('రఘుపతి రాఘవ రాజారాం పతితపావన సీతారాం' అని నాట్యభజన నిమగ్నుఁ డగును. )

(ఒకవైపున నుండి జానకీత్రిజటలు ప్రవేశింతురు)

త్రి:- దేవి ! ఇదియే పొలికలను. నాగపాశబద్ధులై కతిపయసైన్యం బులుతక్క నెల్లరు నేల్లపడియున్నారో చూచితివా ?

జా:- త్రిజటా ! చూచితిని. (శ్రీరామలక్ష్మణులఁ జూచి విభ్రాంతయై) అబ్బా ! దుర్భరము ! దుర్భరము !

క. ఆపాదమస్తకంబును
శాపగములు సుట్టి వైరిభయదం బగుచా
న్చాపయుతుఁ డగుచు నొఱగిన
భూపు న్స్వామిత్రిఁ గంటిఁబో పాపిననై.

హా ! ప్రాణకాంతా ! నాపాదములందలిపద్మరేఖాదిమహా సౌభాగ్యలక్షణంబులఁ గాంచిన దైవజ్ఞు లెందఱో సార్వభౌమునిఁ జెట్టఁబట్టి యభిషిక్తవై మహాక్రతునిరతునిభార్యవై సోమిదమ్మ వగుదువని చెప్పిరేకాని యీావిశుద్ధశ నెఱింగింపరైరి. ఈదార్భా

గ్యరాలిశరీరమునఁ దోఁచుటచే నీశుభరేఖలన్నియు వమ్మయ్యెనా లేక వారలు ముఖప్రీతికై యిట్లసత్యమాడియుందురా ? మహా వీరపుత్రి నగుదునని నుడివినపదవాక్యప్రమాణజ్ఞులగు భూసు రేంద్రులయాశీర్వాదంబులెల్ల వ్యర్థములేనా ? వైధవ్యంబు నను భవింపఁగలనిర్భాగ్యచిహ్నము లెక్క కొక్కటియు నాయెడ లేదే ? ఇది యేమివైపరీత్యము ! ఖరాదిజనస్థానరాక్షసానీకము నసహాయతఁబిలుకుమార్చి, మారుతిచే నావార్త నెఱిఁగి, గోష్పదీ కృతవారాశివై సకలాస్త్రవేది వగునీ వీయింద్రజి త్తనుచిఱు గోతిలోఁ బడితివా ? క్షత్రియోచిత మైనమృతిఁ గాంచినమీకొ అకుఁగాని సౌమిత్రికొఱకుఁగాని యంతగా వగవను. కాని

గీ. దివ్యులకు భక్తిమై యనుదినము మ్రొక్కి
వ్రతములను సల్పి, యెప్పుడు సుతుల, స్నుషను
గాంచ వందురు కౌసల్యగతిఁ దలంపఁ
గఠినపాషాణమైనను గఱఁగిపోవు.

త్రి:- తల్లీ ! జానకీదేవీ ! వగ పుడుగుము. శ్రీరామలక్ష్మణులు మూర్ఛాగతులేకాని మృతులు కారు. ఏలన

చ. పతి మృతిఁగాంచిన న్గలఁగఁబారెడి సేన షుదంబునేది దీ
నతఁగొన, దంబ ! యెన్నఁడు ననాథ వహింపనిపుష్పకంబు ని
స్గుతుకముతో వహించి యిటకు స్గనితెచ్చెను, జీవకాంతి రా
ద్మనుతులను వీడలే; దిటుల శోకమహాంబుధి మున్గ నేటికే ?

క. పలుకఁగ లే దింతకు, నే
పలుకంగాఁబోవ నన్నృతభాషణముల నో
లలనా ! యివ్విధి వృథగాఁ
బలవింపఁగ నేల ? రామభద్రార్ధాంగీ !

ఇఁకఁ బోవుదము పద. ఇవి యన్నియు రాక్షసమాయలు. శ్రీరామలక్ష్మణులను మర్దింప సురాసురులకేని శక్యముకాదు. ధైర్య మవలంబించి పోవుదము పద.

జా:- అమ్మా ! త్రిజటా ! నిరతసత్యాలాపవును నవ్యాజకరుణాంత రంగవునగునీ వనినట్లే యగుఁగాక. నీచెప్పినచొప్పుననే పోవు దము పద. (జానకీత్రిజటలు నిష్క్రమింతురు)

హ:- 'రఘుపతి రాఘవ రాజారాం-పతితపావన సీతారాం' (కరతాళ ములు భజనఁ జేయుచుండును)

(సుగ్రీవుఁడు ప్రవేశించును)

సు:- (సంతోషముతో) అదుగో రామచంద్రమూర్తి కనులఁ దెఱచు చున్నారు.

శ్రీ:- (ఇంచుక పొరలి కన్నులఁ దెఱచి) ఆహా ! ఏమి యీచిత్రము! ఈనాగబంధంబు లెంతగట్టిగ ననుఁ గట్టినవి ? (ప్రక్కనఁజూచి) అక్కటా ! నాబంధనంబులకు నే నంతచగనను. హా హతవిధీ ! రాజ్యభోగంబులను సరకుఁజేయక, ప్రియమాతను వీడి, యపర రతియగు నర్ధాంగి నూర్మిళను బాసి, వలదనుచుండినను గాళ్ళకు వ్రేళ్ళకుఁబడి నను సేవింపవచ్చిన యసహాయశూరుఁడును, భాతృభక్తిభరితుండును, నిష్కళంకచరిత్రుఁడును, గష్టకాలంబున నాకుఁగరావలంబమునగు మాలక్ష్మణునిగతిఁ గాంచిన నాగుండె నీరగుచున్నది.

చ. సతి యెడబాసిన న్సుగుణజాలయుఁ దత్సతితుల్య చిక్కె ; నీ
యతులితవిక్రముండు, సుగుణాఢ్యుఁడు, సంతతభాతృసేవనా
రతుఁ డగులక్ష్మణుం డెటుల రామున కబ్బును ? రేగుపండుకై
రతనముఁ గోలుపోయినగరాసునిఁ బోలితి నక్కటక్కటా !

ఒకవేళ నీరాక్షససైన్యంబుల నొక్కఁడఁ జించిచెండాడి సీతాసహితముగ నయోధ్యకుఁ బోవునదృష్టము ప్రాప్తించినను నాపినతల్లి, నాసుఖంబుకొఱకై తనస్వపుత్రుని నాకుఁ దోడు పంపిన సుమిత్రవదనం బెట్లు తేటిపారఁజూడ మనసొప్పును ?

గీ. 'నాయనా ! నీదువెంట వనంబునకును
వచ్చినట్టి నీలక్ష్మణభ్రాత యేఁడి' ?

యనుచు ననుఁబృచ్ఛచేసెడిజనని కెదురు
పడుటకంటెను లజ్జ చొప్పడునె యెటను ?

మ. 'నిను వెన్నాడినతమ్ముకుఱ్ఱ నొకని న్నీబాణసంఘంబుచే
తను రక్షింపఁగలేకపోయితివె ? చింతా నీకుఁ దమ్ముండు వో
యిన? భార్య న్గొనివచ్చినాఁడవొకొ యెంతేప్రీతి'? నంచాడు త
జ్జనని న్గాంచుటకంటె లక్ష్మణునితోఁ జావే ప్రశస్తం బగున్.

తమ్ముఁడా ! లక్ష్మణా ! సకలభోగనివాసం బగునయో ధ్యావాసమును గాలఁదన్ని క్రూరసత్వసంకీర్ణం బగువనవాసమే వరించి న న్ననుసరించి నాదురదృష్టంబున విధివైపరీత్యంబున యమాలయంబున కేగిన నిన్ను నే ననుసరించి సీతాపరిగ్రహణము భ్రాతృవత్సలుం డగులక్ష్మణానుగమనమున కీడుకాదని లోకమునకు వెల్లడించెద. హనుమా ! సుగ్రీవుని బిలువుము.

హ:- ప్రభూ ! ఇచ్చటనే యున్నారు.

సు:- ప్రభూ ! ఏమి యాజ్ఞ ?

శ్రీ:- సుగ్రీవా ! ఉత్తరక్షణ మేదొసఁగుఁ బొసఁగించునో యెఱుఁగ నెవ్వరి వశము ?

చ. బలములఁగూడి రావణునివంశముఁ గూకటివేళ్ళతోడ బి
ట్టలుకను బెల్లగింపఁగ హుటాహుటి వచ్చితి, సవ్యహస్తమా
బలియుని లక్ష్మణు న్ననుము; బాహువిహీనుఁడు సంగరం బెటు
ల్సలుపఁగలాఁడు నే నతనిజాడనె పోవఁగ నిర్ణయించితిన్.

నీయెడ నొనర్చినసమయముఁ దీర్చి వానరరాజ్యసార్వభౌము నొనర్చితి. లక్ష్మణునిజాడ నేనుఁ జనిన వైరికి సాయమొనర్పవచ్చినాఁడవని కినిసి రావణుఁడు నిన్ను ససైన్యము మర్దింపఁగలఁడు. కావున నామాట విని సత్వరమ కిష్కింధాభిముఖుండవు కమ్ము. విధినిర్ణయమున కన్యథాత్వముఁ గల్పింప మానవు లెంతవారలు ? కాని నే నొక్కదానికై మాత్ర మసత్యప్రలాపిని గావలసివచ్చెనేయని విచారింప వలసియున్నది.

ఉ. లంకకు రాజుఁజేతు నబలంబుగ రావణుఁగూల్చియంచుఁ బె
న్బింకములాడి పల్కితి విభీషణుతో, ననుజుండు గూలె నా
బింకము గంగలోఁగలియువేళగఁ దోఁచెడి ; నాడితప్పుఁగాఁ
గొంకుదయించె ; నార ! ప్రతికూలవిధి న్గడువంగ శక్యమే?

(తెరలోఁ గలకలము)

ఆ. పాపనారసములఁ బరపినరావణి
చాక మిగిలినట్టిసైన్యములను
జనుపఁ గేలఁ బసిఁడిగదఁ గొని వచ్చెడి
పిక్కబలమె బ్రిదుకువిధము మనకు.

సుగ్రీవా ! ఏమాకోలాహలము ? (విభీషణుఁడు ప్రవేశించును)

వి:- జయము. జయము శ్రీరామచంద్రప్రభువునకు.

శ్రీ:- విభీషణా ! ఏమాకోలాహలము ?

వి:- మహాప్రభూ ! నన్నుఁ జూచి యింద్రజిత్తని శంకించి మనకపిబృంద మంతయుఁ బలాయనమంత్రముఁబఠింప వారివెఱపుఁబాపి పిలువ జాంబవంతునిఁ బనిచివచ్చినాఁడను.

శ్రీ:- విభీషణా ! మంచిపనిఁ జేసితివి. మన కింకను జయమా ?

చ. జనకజ లంకఁ జిక్కె, ననుజన్ముఁ డతుల్యపరాక్రముండు చిక్కెను లయకాలునోట, నిటఁ గే ల్గదలింపఁగలేనిపాటు నాకు నమరె, నీకు రాజ్యమునుగూర్చెదరావణుఁ ద్రుంచియన్న వాకుక నవయునంచు నెంతయునుగుందెద దానవవంశచంద్రమా!

వి:- ప్రభూ ! సాగరము గగ్గోలుపడఁజేసిన మీ శౌర్యము సామాన్యమా ? విధి బలీయమైనప్పు డెట్టిశౌర్యధను లేమి చేయఁగలరు? ఇది నాకర్మఫలముకాకుండిన యీనాగబంధంబులేమి మిమ్ములఁ గట్టుటయేమి ?

సు:- విభీషణా ! సుషేణునియుపాయానుసారముగ సంజీవకరణిఁ దెప్పింతమా ?

వి:- ఏ మాంమహానినదము ?

ఆ. దూదిపింజలట్లు తూలెడు మేఘము
ల్జలధి పొంగి తాకు జలధరములఁ,
బెళపెళమని వృక్షవితతి గూలెడి, భూమి
వడఁకఁదొడఁగె దేనివలనఁ జెపుఁడి.

సు:- మహాప్రభూ ! ఏమి నాగపాశము లిట్లు సడలుచున్నవి ?

శ్రీ:- సుగ్రీవవిభీషణులారా ! కడువిచిత్రముగ నున్నది. ఈనాగ బంధంబు లెల్లర విడిచి సముద్రములో దూరుచున్నవి. కారణ మేమైయుండును ? (పరికించి)

గీ. దుర్నిరీక్ష్య తేజంబునఁ దోఁచునతఁడె
ఖగకులేశ్వరుఁ డాతనిఁ గాంచినంతఁ
బాఱుచున్న వెల్లరఁ గట్టుపాశకట్లు
సమయసుసహాయుఁడు నిజంపుసఖుఁడు కాఁడె ?

ఇదిగో దరియుచున్నాఁడు.

(గరుడుఁడు ప్రవేశించి దరిసి శ్రీరామలక్ష్మణులఁ దన చంచుపక్షంబుల నిమురును)

శ్రీ:- ఖగకులేశ్వరా ! మహానుభావుండ వగుమీదర్శనంబు నాకుఁ బితృపితామహదర్శనతుల్యామోదదం బయినది. తమనామంబుచేఁ బవిత్రతఁ గనినవర్ణంబులఁ దెలిపి మము ధన్యులఁజేయుఁడు.

గ:- స్వామీ ! నేను మీ వాహనమును, హితుండ నగుగరుడుఁడ. ఈమేఘనాదప్రయుక్తనాగబంధము లమరవర్యులకైన నసాధ్యం బులగు టెఱిఁగి మీకు సాయపడ వచ్చితి. రాక్షసులు మాయా యుద్ధవిశారదులేకాని ఋజుపథవర్తులు కాగు. వారలయెడ జాగ రూకత యుద్ధ మొనరింపఁదగు. నావృత్తాంతము యుద్ధానంతరము

సొంత మెఱింగింతు. ప్రస్తుతము నాకు సెలవిండు. (శ్రీరాము లక్ష్మణులం గౌఁగిలించుకొని ప్రదక్షిణించి యెగిరిపోవును.)

ల:- అగ్రజా! ఆపిఱికిపంద యింద్రజిత్తేఁడీ? కానుపింపఁడేమి? ఎచట డాగినాఁడు? నాకూ్రరబాణంబుల కెరఁజేసెద.

శ్రీ:- తమ్ముఁడా! శాంతింపుము.

క. పాపగములపాలై మృతు
రూపుంగనియున్న నిను గరుడుని కరుణచే
నోపితి నిటు చూడఁగ సం
తాపం బడుగంటుటయె ముదంబు జయంబుల్.

సు. వి:- శ్రీరామలక్ష్మణప్రభులకు జై. జై. జై. (కేకలు వైతురు. కపిభల్లుకసింహనాదములు చెలఁగును)

సు. హ. వి:- మహాప్రభులారా! ఈసింహనాదముల విని యుద్ధంబున కాయత్తపడి వచ్చుచున్న రాక్షససేనానులను రావణునిఁ జూతము రండు. (కొంతవడి పరిక్రమింతురు)

(తెరలో)

ఉ. నాగశరంబుల న్బలదనాథుఁడు క్రమ్మఁగ నెత్తురోటరుల
న్దోగుచుఁ జచ్చినట్టులఁ గనుంగొనువారికిఁ దోఁపఁజేసి పు
న్నాగుఁ డతండు వీటికిఁ జన న్బ్రనుపోటరు లట్లు కూయఁగా
సాఁగిరి రావణేశ్వరునిసాహసము న్గన రండు క్రమ్మరన్.

వి:- స్వామీ! రామచంద్రప్రభూ! సర్వబలంబులు నాగాస్త్రంబున మడిసిరని యింద్రజిత్తుచే విని క్రమ్మర సింహనాదముల విని తిరిగి వీరెట్లుబ్రతికిరా యనునాశ్చర్యమునఁ దానే స్వయముగాఁ బోర ససైన్యముగ వచ్చుచున్న రావణువాక్యములే యివి. రామబాణ రుచి యెఱుఁగనిమందమతికిఁ గొంచెమురుచిఁ జూపుట మంచిది.

శ్రీ:- విభీషణా! రాని మ్మానీచుని నటులే చేసెద. (రావణుఁడు కటాక్షేపముతోఁ బ్రవేశించును)

రా. క. బాలునిఘాటికి నోర్వఁగఁ
జాలక పొలికలన మూర్ఛఁ జచ్చినగతిగా
సోలినయా దాశరథులఁ
దూలించును రావణుండు దోర్బలయుక్తిన్.

ఏరీ యారామలక్ష్మణులు ? వారల నాశరాగ్ని కిపుడే యింధనమొనర్చెద. (పరికించి) రాముఁ డిటనే యున్నాఁడే ? రామా ! అంగమిని రాయబారమున నీనుడివినశౌర్యముఁ జూపనిదియే యదను. లెమ్ము. నడికట్టుఁగట్టి యుద్ధమునకు దిగుము.

:- రావణా ! నేఁటికి మగవాఁడవై యెదుర్కొన వచ్చితివా ?

మ. నిజరూపంబున వచ్చి పోరుటకు సన్నద్ధించి మారీచు న
క్కజపుస్లేడి నొనర్చి దాని మదిలోఁ గాంక్షించుభూమీసుతన్
నిజనాథు న్వడిఁ బాపి, చౌర్యమున నానీరేజపత్రేక్షణన్
సుజనారాధ్యను దస్కరించి మొగము న్జూపంగ నేతెంచితే ?

చ. పరసతి, నంపు సద్గుణవిభాసిత, భార్గవజేతృభార్యఁ, ద
స్కరుగతిఁ దెచ్చినట్టిదశకంఠుని దుంచెద నేను, నే నటం
చు రయమునీటుఁ దూణమునఁ జారతఁ గ్రక్కడి నాశరాళి నేఁ
దరలఁగఁ జేయు మేటిదయఁదాల్చుట మూర్ఖకులావతంసమా!

దోగికిఁ బథ్య మహిత మగుకరణి నాహితము నీ కరుచి యగుట తప్పకవచ్చెఁ గానఁ గాచికొమ్ము. (శరము కోదండమునఁ దొడిగి)

మ.స్ర. ఘనమౌరథ్యంబులన్నింగరతలమునఁ జీకాకుగాఁ గూల్చి కేతుం
బును నేల న్గూల్చి, నిన్నున్బొరిగొని, ధనువున్ముక్కలై పోవఁగానీ
మనము న్దార్ఢ్యంబు వీడ, న్మద మడఁగఁగ దుర్మార్గతన్బాపి నిన్నీ
ఘనవంశోద్భూతభూపు న్పాదిని దలఁపఁగా నీశరమ్మే యొనర్చున్

(బాణమోక్షణ మొనర్చును. రథరథ్యసారథిధనుర్భంగమై రావణుఁడు నిలిచి దీనాననుఁడై రక్తసిక్తాంగుఁడై నిర్విణ్ణుఁడై స్తబ్ధుఁడై నిలువఁబడును)

రా:- (స్వగతము) ఏమీ రామబాణపటిమ! రథ్యంబులా సమసె. సారథియా మడిగె. చేతివిల్లా తెగె. రక్తధారలు పర్వతనిర్ఝరము లట్లు స్రవించుచున్నవి. వెన్నిచ్చుచనుట రణధర్మము కాదు. ఏమొనర్తు? (యోజించుచుండును)

శ్రీ:- (స్వగతము) ఆహా! నాయంతరంగభక్తునిస్థితి యెట్లున్నది? కాదా భక్తుడన వీడే. నన్ను సత్వరమ చేరుటకుఁ దనసర్వస్వము నాశముఁజేసికొనుటకు సిద్ధపడియున్నాఁడుకదా? ఇప్పుడే వీనిని దునుముదమనిన రాజు పడినతర్వాత సకలసైన్యముఁ బారు. కావున వీనిని సబాంధవముగఁజంప ననువుపడదు. వీనియందలి కారుణ్యమున వీని నిప్పుడే యంతమొందించి సాయుజ్యమొసంగ బుద్ధిపొడమినను శ్రీరాముఁడు నిరాయుధుఁడై యున్నతఱి రావణుని గెల్చెనని పామరు లనుకొందురు. కావున రణధర్మం బనుష్ఠించెద. (ప్రకాశముగా) రావణా! ఏల యట్లు నిరాయుధుఁడవై జాలివాడమునట్లు నావైపు చూచెదవు? నిరాయుధునితోడను, విరథునితోడఁ బోరుట వీరధర్మము కాదు. కావున నిన్నిపు డేమి రొక్కన నిచ్చగింపను. పొమ్ము. సేద దేఱి సరథపరికరుఁడవై యుద్ధముఁజేయ రమ్ము. పొమ్ము. (రావణుఁడు దీనాననుఁడై నిష్క్రమించును)

వి:- రఘువరా! ఆవైపు చూడుము.

ఉ. నిద్దురలేపి యగ్రజుఁ డని న్బొనరింపఁగఁ బ్రోత్సహింపఁగా
బద్ధువహించి రామనరపాలునిఁ గూల్చుటకా లేక కూలుటో
యిద్దినమందె తేల్తునని యెంతయు నుద్ధతితోడ వచ్చువాఁ
డద్దిర! కుంభకర్ణుఁ గని యయ్యదె వానరసేన విచ్చెడిన్.

మహోన్నతలంకావప్ర మాతనిమోకాటి యెత్తునకు రానట్టిమహోన్నతాకారముతో వచ్చుచున్నాఁడు. అక్కట కటా! అతిభయానక మతిభయానకము. బధిరీకృతాష్టగజ మగు నాతని సింహనాదంబుచేఁ గొంతకపిసేన కూలినది. కొందఱు

కాలికి బుద్ధిఁజెప్పుచుండఁ బ్రచండవాయువేగమున వారివెంబ డించుచుఁ జేఁజిక్కినప్లవంగులను నోటఁబెట్టుకొనుచు నడ్డుపడ నెంచుకపివీరుల సరకుగొనక మనలఁ గవయవచ్చుచున్నాఁడు.

గీ. విలయకాలంబునను బొంగుజలధిపగిది
వచ్చుచును దన్నుఁ దాకుప్లవంగములను
ద్వీపముల ముంచివైచునాధీరవర్యు
నాప, శ్రీరామ వేలవై హర్ష మిడవె.

శ్రీ:- ఆతనిఁ దాకి నిలువరింప నే నిదే పోవుచున్నాఁడ.

(సరభసముగ నిష్క్రమించును)

సు:- (స్వగతము) శ్రీరామమూర్తి కుంభకర్ణునిఁ దాకఁబోవుచున్నాఁడు. నేనును నాశక్తిఁ గొంత చూపెద. (నిష్క్రమించును.)

వి:- లక్ష్మణప్రభూ! చూచితిరా సుగ్రీవునిసాహసము? కుంభకర్ణుని మీఁదఁ జేతఁజిక్కక యటునిటు లంఘించుచుఁ జికాకొనర్చు చున్నాఁడు.

ల:- విభీషణా! అదిగో యెట్టకేలకుఁ గుంభకర్ణుఁడు సుగ్రీవునిఁబట్టు కొని నోటఁబెట్టుకొనఁ బోవుచున్నాఁడు. అయ్యో! ఆస్వామి భక్తున కెంతకష్టము సంభవించినది?

వి:- నడుముఁ బట్టుకొని విడిచిపెట్టని కుంభకర్ణుని ముక్కుఁ గొఱికి చెవుల లాగివైచి యెగిరి దుమికినాఁడు.

ల:- బలే. సుగ్రీవా! బలే! తగినశాస్తిఁజేసి శూర్పణఖయన్న నొన ర్చినావులే.

వి:- లక్ష్మణప్రభూ! చూచితివా? ముక్కుసెవులు తెగినరోషం బునఁ దనవారుఁ బెరవా రనునదికూడఁ జూడక క్రోధాంధుఁడై రాక్షసకపిసైన్యంబులపై సమస్తాస్త్రంబుల గుప్పుకుంభకర్ణునిహస్త ద్వయంబునకు గుఱిఁజూచుచు మహారాజుగా రర్ధచంద్రబాణ యుగంబున ఖండించుచున్నారు. అక్కటా! నేను జూడఁజాల కున్నాఁడను.

గీ. బాణసంధానమున జంటఁబాయకుండు
నీదుభుజనాగమిథునంబు నిపుణమతియుఁ
జాపవిదుఁ డగుశ్రీరామచంద్రమూర్తి
బాణతార్క్ష్యునిచేఁ గూల్పఁబడెనె ? యకట !

ఆక్రిందఁబడిన కనకకంకణయుత హస్తద్వయపాతమునఁ గొందఱు కపులు చచ్చిరి చూచితివా ?

ల:- విభీషణా ! అగు నగును. అంతటితోఁ దీఱెనా ? బావాలువిహీనుఁడయ్యు నినుమడించినకోపంబున సేనపైఁ గవయుచున్నయాతని చరణయుగంబునకు గుఱివెట్టుచున్న యగ్రజునివైపు చూడుము.

వి:- అయ్యో ! అయ్యో ! బీరువోవనిరామబాణంబులతాకున నాతని రెండుకాళ్లుఁ దెగినవి. హామహావీరా ! అగ్రజా ! కుంభకర్ణా ! నాహితంబు వినని నీపాటు నే చూడలేకున్నాఁడఁగదా ? (కనులు మూసికొని) శ్రీరామరామ. ఈపాట్లు పగవారలకైన వలదు. వలదు. (తెరలో)

ఉ. చేతులు కాళ్లు వోయినను సింహమహార్భటి బొబ్బవెట్టుచు
న్నోఁతుల భీతుల న్నలుపఁగోరెడినీదగుమస్తకంబు నీ
శాతశరంబున న్దునిమి సాహసమొప్పఁగఁ గీశసంఘపు
న్ప్రీతి నదల్చి భూతబలిఁబెట్టెద రాక్షసరాజసోదరా !

వి:- అబ్బా ! నాకన్నులు కాలిపోను. దుర్భరము. దుర్భరము. శ్రీరామచంద్రమేఘగర్జానుచారి యగురామబాణాశని యాతని శిరంబుఁ గొనిపోయి లంకాద్వారంబునఁ బడవైచె. ఆరావణుఁ డెంతమూర్ఖుఁడు ?

క. కొందఱు సేనానులు మృతిఁ
జెందిరి, యక్షాత్మజుఁడు నశించెను, దమ్ముం
డిం దొరిగె, నింత నైనను
బొందొనరింపంగ సుంత పూనఁడు కట్టా !

విధిని దప్పించుకొన నేరివశము ? అరుగో మహారాజుగారు కుంభకర్ణునిఁ దెగటార్చి జయోదిరాకరసన్మానితులై వచ్చుచున్నారు. (శ్రీరాముఁడు ప్రవేశించును.)

ల. వి:- జయము. జయము మహారాజుగారికి.

శ్రీ:- ఏమాకలకలము ? (తెరలో)

గీ. జనకుపరిభవము పితృవ్యుచావు వినుచు
నొక్కపెట్టునఁ జెలరేఁగునుమ్మలికము
మండఁగా భూమిజను దెచ్చి భండనాగ్రి
తలమునను మేఘనాదుండు తల దఱిగెను.

శ్రీ:- ఎవఁడురా వృథాశ్లీలప్రలాపి ? రావణపరాభవహేతుభూతం బగునీనిశితశరంబున కెవ్వఁడురా మలిముద్ద కాఁదెగించినయసత్ప్రలాపి ? (హనుమంతుఁ డతిదుఃఖితుఁడై ప్రవేశించును.)

హ:- హా రామచంద్రా ! దయాగుణసాంద్రా ! ఏమిచెప్పను ? (శ్రీరామునిపదంబులపైఁబడి మూర్ఛిల్ల శ్రీరామలక్ష్మణులు శైత్యోపచారములఁజేయ నించుక కన్నుఁదెఱచి వెక్కి వెక్కి యేడ్చును.)

శ్రీ:- నాయనా ! హనుమంతా ! ధైర్యహేమాద్రి వగునీ వింతదుఃఖింపఁ గారణమేమి ?

క. జలనిధిఁ దరియించెడుతఱి
బలవద్రాక్షసుల నెదిరి బాహుబలంబున్
వెలిఁబుచ్చెడితఱి సుంతయుఁ
జలియింపవె ? యిప్పు డీవిచారం బేలా ?

హ:- (దుఃఖముతో) మహాప్రభూ ! జనకా ! రామచంద్రా ! సర్వరాక్షససమూహము నంతమందించి నిన్నే మదిఁదలంచి కృశించుచు 'జగత్ప్రాణపుత్రా ! నే మనున దిఁక నొకనెలమాత్రమే. ఈలోపుగా శ్రీరామచంద్రుని నన్నుఁగొనిపోవునట్లు చేయుము'ని ప్రార్థిం

చిన భూమిజను నేఁడో రేపో మీపాదసన్నిధానమున సమర్పించెద ననిన నిందుకొఱ్ఱకేతో నున్ననే నానోము నోచనైతిని గాఁబోలు.

గీ. జానకీక్షేమవార్త యన్గలముల నిడి
జనకజశిరోమణీ సుదర్శనపుటేడు
గడనఁ బెంచినరామకాంక్షాలతికను
నేన వాగ్గవిత్రమున మ్రందింపవలసె.

శ్రీ:- (ఆతురముతో) పావనీ ! అయిన నిప్పు డేమాయె ?

హ:- ఉ. ఏసతిజాడఁ గాంచ దరియించితి నీజలరాశి నేను, ము
న్నేసతిమూర్ధమందున వహించుశిరోమణి యామెఁ గాంచఁగా
నాసనుగూర్చె మీ, కెవరికై శ్రమ వారధిఁ గట్టినారమో
యాసతి మేఘనాదుఁడు ఖరాసి విఖండితశీర్షఁ జేసెఁగా !

శ్రీ:- హాజానకీ ! (మూర్ఛిల్లును. హనుమల్లక్ష్మణులు శైత్యోపచారములఁ జేయుచుందురు.)

ల:- అక్కటా ! రఘువంశముగతి యేమిపట్టినది ? హారామా ! ఈ పాడుకన్నులు నిన్నెట్టి దీనశోచ్యదశఁ జూడఁబాపమొనర్చె.

గీ. అచిరకాలంబులోనఁ బట్టాభిషేక
సింహపీఠాన జానకిచెంత వెలయు
నిన్నుఁగాంచ నువ్విళ్లూరు నేను, నిన్ను
జానకీరహితు నిటుఁ గాంచఁగవలసె.

మామెల్లరకన్నులు మంగళంబులఁ జూడ నోఁచుకొనలేదు కాఁబోలు !

శ్రీ:- (కొంచెము స్మృతిఁగని)

గీ. జానకీ ! భూమిజా ! సీత ! జనకరాజ
పెన్నిధానంబ ! కౌసల్య ప్రేమఁజూచు
గరిత ! శ్రీరాముప్రాణమా ! కఠినుఁడైన
యింద్రజిత్తుఖరాసి నెట్లోర్చితోకొ ?

చ. అనయ మెవండుఁ గావఁగలఁడంచుఁ దలంచి జపించుచుండి దు
ర్దినముల లెక్కఁబెట్టితివొ దీనత, నట్టిఁడురామిఁ గ్రూరుఁడై
దనుజసుతుండు ని న్దునుమ దారుణఖడ్గము నెత్త, నిండుభీ
తి నెటుల బొబ్బఁబెట్టితివొ? దీనను బ్రోవఁగనైతి నక్కటా!

సకలగుణగణాలయవు, నర్ధాంగలక్ష్మివి నగుని న్నట్టిదీనదశను బ్రోవలేక భీతహరిణాంగనను గటికవానిహస్తంబునుండి విడిపింప నేరని యీపౌరుషహీనున కింకను సమరముజోలి యేల? ఎవరి కొఱ కింతప్రయత్న మొనరించితినో యాసాధ్వి యసువులఁబాయ నెందుల కీయకాండతాండవము? సుగ్రీవవిభీషణులారా! ఎవరి కొఱ కింక నీసంగర మొనర్పవలసినది?

వి:- రామచంద్రప్రభూ! ఇది యెచ్చటనేని సంభవింపఁగలదా?

చ. కినుక నగంబు క న్గొనువఁ గీర్ణజగంబుల, భూతపాళి, నా
యిను, నమృతాంశు, నెల్లర దహింపఁగనోపు పతివ్రతామత
ల్లిని స్పృశియింపనేర్చునె మలీమసుఁ డాతఁడు? జీవితేచ్ఛయుం
డిన జనకుండు కోరు నవనీరజనేత్రను జంపనేర్చునే?

శ్రీ:- విభీషణా! అయిన జానకిని మేఘనాదుఁడు కరవాలమున నఱకు చుండఁ జూచినయాంజనేయునివాక్యము లసత్యములా?

వి:- రాఘవేంద్రా! ఇంద్రజిత్తు జానకిని గరవాలంబున కెరఁజేసినది నిజము. దానిని మన యాంజనేయుఁడు కాంచినదియు సత్యమే.

శ్రీ:- అక్కటా! విభీషణా! నీవాక్యములు పరస్పరవిరుద్ధంబులుగ నున్నవే? నీకడపటివాక్యమే సత్యమైన నా కేమియూరట కలదు?

వి:- రఘూత్తంసా! అచ్చటఁగలతెఱం గిది. మాయామోహితసర్వ భువనుం డగునింద్రజిత్తు వధించినది మాయసీతనే కాని మాయర్ధాంగిని గాదు.

శ్రీ:- జానకీమరణవృత్తాంతాశనిక్షతము లైనయీరామప్రాణంబుల మాయాసీతాహననవృత్తాంతామృతధారావృష్టి సేదఁదేర్చితివి.

ఆయుదంతము సాంతముగ నెఱింగించి నన్ను సంతోషాంబుధిఁ దేల్పుము.

వి:- ఇనకులాబ్ధిసోమా ! పితృపరాభవము పితృవ్యమరణవృత్తాంతము విని మిమ్ముఁ జెనక వెఱచి మిమ్ము దుఃఖవారాశి ముంప నసమాన మాయావిద్యావిశారదుఁ డగువిద్యుజ్జిహ్వునిచే మాయసీతను నిర్మింపఁజేసి తమ కెఱింగించుటకై యీమనయాంజనేయునికట్టెదుట నాతఁడు వలదనుచుండిన లెక్కసేయక యాబొమ్మకంఠ మిందజిత్తు తునిమె.

శ్రీ:- విభీషణా ! ఈమాట నాయూరటకై పలుకుట కాదుకదా ? నిజమేకదా ? ఈసంగతి యెట్లెఱుంగఁగలిగితివి ?

వి:- సరమవద్దనుండి వచ్చినచారునివలన సర్వ మెఱింగితిని.

శ్రీ:- పరమభక్తురా లగుసరమసందేశమం దసత్య ముండదు. అయిన రావణి యీవిధి నొనర్చుటకుఁ గారణమేమో ?

వి:- అట్టియవాచ్యము నతిశోకాకర మగువిషయ మొకటి జరిగినమన మందఱము కుప్పకూలి దుఃఖించుచుండ జయప్రద మగునొక యాగ మొనరించి యాయగ్నికుండంబునఁ బొడమెడిదివ్యరథ, చాప, బాణములచే నజేయుఁడై మనల నెదిరింప సమకట్టి యిట్టిది కూర్చెను.

శ్రీ:- అయిన నిపుడు కర్తవ్య మేమి ?

వి:- తత్క్షణము మనసేనను లక్ష్మణసహితంబుగఁ బంపి యాగవనధ్వంస మొనర్చి యింద్రజిత్తును వధించుటయే. ఆయాగము పూర్తియయ్యెనా యాతని నెదిర్చి జయింప సురాసురులకేని యసాధ్యము. కావునఁ దత్క్షణము లక్ష్మణప్రభువును ససైన్యముగఁ బంపుటయే కర్తవ్యము.

శ్రీ:- అటులే చేయుదము లక్ష్మణా !

ల:- అగ్రజా ! ఇంకను యోజన యేల ? నే సర్వసంసిద్ధుఁడ.

శ్రీ:- నీవు తత్క్షణమ కపిభల్లుకసైన్యములతోఁ గదలిపోయి యింద్రజిత్తుయాగవిఘ్న మొనర్చి మెదిరించిన నాతని మట్టుపెట్టి రమ్ము. మేము కుంభకర్ణునిఘాకకు పోలినసైన్యంబులఁ బరికింప సుషేణో పేతులమై యేగివచ్చెదము. విభీషణా! మాయాయుద్ధవిశారదుఁడగునింద్రజిత్తుఁ దాకఁబోవుతమ్మునకుఁ దోడుచనుము.

వి· లః- చిత్తము. (శ్రీరామునకు సాష్టాంగదండప్రణామ మొనర్చి లేతురు.)

శ్రీ:- దీర్ఘాయుష్య మస్తు. విజయోస్తు. (నిష్క్రమించును.)

వి:- అదిగో మహారాజుగారియాజ్ఞానుసారము కపిభల్లుకసైన్యము లనుసరింప సిద్ధపడి నీయాజ్ఞకై వేచియున్నవి.

ల:- విభీషణా! జాంబవదాదుల ససైన్యముగ నింద్రజిత్తుయాగప్రదేశము నారసి ముట్టడింపఁ బంపిరమ్ము. మన మిప్పుడే కదలుదము.

వి:- (నిష్క్రమించి ప్రవేశించి) అదిగో వారు దేవరయాజ్ఞానుసారము పోయి నేమకుచున్నారు. మనముకూడఁ గాలయాపనముసేయక యేగుదము. (పరిక్రమించుట నటించి) రాక్షసమాయానభిజ్ఞులు కనుక వా రెచ్చట నెచ్చటనో వెదకుచున్నారు. ఇదిగో యీ వైపు చూడుము.

గీ. తనదుసంతతి రొమనరించుతప్పిదముల
గర్భమునఁ బెట్టికొని ప్రోచుకన్నతల్లి
రీతి నింద్రజిద్యజ్ఞపరికరములను
దాచుచున్నయీన్యగ్రోధతరువుఁ గంటె?

సర్వపరికరములఁగూర్చి యిచ్చట యజ్ఞేశు నర్చింప సన్నద్ధపడియున్నయీయింద్రజిత్తు నీవటవృక్షమును దరియనీక యించుకయుఁ దెలిపినీక సంగరంబొనరించి మట్టుపెట్టుటే కర్తవ్యము. ఏమాకలకలము? (తెరలో)

ఉ. రక్కసివై జనించి స్వపరాక్రమము న్విడి, యన్న, వైరియౌ
గక్కరితి న్వెసంగఁ దగుకాలమున న్విడి యన్న, వచ్చుపె
న్జిక్కుల నెంచకే యరిని జేరియుఁ జాలక నాదుగుట్టు నీ
బక్కకుఁ జెప్పి పిల్చుకొనివచ్చితివా కొ? త్రపావిహీనుఁడా!

వి:- లక్ష్మణా! వింటివికదా యీదుర్మార్గుఁ డగునింద్రజిత్తుప్రలాప
ములు? తనయజ్ఞవిఘ్న మొనర్చితినని నాపై మండిపడుచుఁ
గన్నుల నగ్నికణముల రాల్చుచు నెట్లువచ్చుచున్నాఁడో? ఇఁక
నన్ను దూషణపరంపరలచే ముంచఁగలఁడని తోఁచుచున్నది.
'తాటాకులచప్పుడునకుఁ గుందేళ్ళు బెదర'వనునట్లు నేను వీనికి
బెదరుదునా?

ఇంద్రజిత్తు:- ( పటాక్షేపముతోఁ బ్రవేశించి ) ఛీ! భ్రాతృ
ద్రోహీ! కులద్రోహీ! రాజద్రోహీ! నీమొగముఁ జూచినఁ
బాతకము వచ్చును.

శా. వాలాయంబుగ రాజ్యసంగ్రహమ నీవ్యాపాదమైయున్నచో
శ్రీల న్జెన్నలరారు నాసురపురి న్జింతామణీపీఠిపై
హేలన్ ధీరత నిల్పియుండనొకొ? యీహీనాత్ముల న్వైరుల
న్గాళు ల్వట్టఁగ నేమివచ్చెనుర! రక్షశ్చక్రవిధ్వంసకా!

మ. ఉదయంబాది యసత్యవాది,శఠు, దస్యు న్గాంచఁగావచ్చు, నెం
చ దయాలేశవిహీనగోహననునాస్యంబు న్గనన్ వచ్చు, భీ
ఫ్రదుఁడౌ మర్కటుఁజూడవచ్చుఁ గులవిధ్వంసం బెద న్గోరు నీ
వదనంబు న్దిలకింపనొల్ల నిఁక నోపాపాత్మకా! వంచకా!

వి:- మేఘనాదా! నోటికి వచ్చినట్లు ప్రేలిన నేమిసార్థకము? నాయొన
ర్చినకార్యంబున నధర్మ మొకటేని గలదని వ్రేలుమడిచి చూపఁ
గలవా? వినుము.

చ. పరసతి దొంగవోలెఁ జెఱపట్టుట తప్పని చాటిచెప్పనో?
నరపతి మైనరాఘవునినాతిని నాతని కప్పగించి వే

శరణమువేఁడుమం చననా ? సత్యము రాక్షసనాశనంబు చే
కురునని చెప్పనో ? వినని కూళతనం బది నాదుదోసమే.

ఇం:- ఇందు నీదోసము లేకుండిన నుండుఁగాక. దుర్మార్గుఁడైనను రాజును, అందు నేకోదరుండునగు నగ్రజుని వైరులు చుట్టు ముట్టి యున్నతఱిఁ బాసివచ్చుటమాత్రము రాజనీతివిదులు తప్పనక మానరు.

వి:- కుమారా ! నీవచనంబులకు నాకుఁ గినుక జనింపదు.

ఉ. నెత్తిన నోరువెట్టుకొని నీ వవికృత్య మొనర్చియుంట, లో
కోత్తరశౌర్యశాలి యరి యుమ్మలికమ్మున వచ్చె నన్నచోఁ
జిత్తమునందుఁ గోప మెగఁజిమ్మ సభాస్థలిఁ గాలఁదన్న న
న్నత్తినయా పరాభవము నార్పఁగ వైరిని జేరు టబ్రమా ?

న్యాయాన్యాయహితాహితవివేకవిహీనుఁడు రాజుగనుండుట ప్రజల కెన్నటికిని క్షేమము కాదనుట కీరాక్షసకులనాశనమే ప్రత్యక్షలక్ష్యము. నేను శత్రుపక్షమునఁ జేరుటనుగుఱించి బాగుగ వితర్కించి నాపథమే ముమ్మాటికి ధర్మానుసరణమనియే నిర్ధారణచేసి ధర్మాపరావతారుఁడును, అసమానశౌర్యధనుఁడునగు శ్రీరాముపక్ష మవలంబించితిని. వారికి జయంబుఁగూర్ప సకల విధంబుల సాయంబుఁజేయఁ గంకణముఁగట్టుకొని వచ్చినాఁడ. లక్ష్మణా ! దుష్టరాజునకు సాయ మొనర్పవచ్చిన యీవాక్శూరునితో నీనిశితాస్త్రపరంపరయే సంభాషించుఁగాక.

ఇం:- (వికటహాసముతో) ఓహో ! ఆలాగా ! ఈవీరుని బాణసంభాషణకు నాగాస్త్రప్రయోగంబునాఁటిదృశ్యమే ప్రత్యక్షసాక్ష్యమై యుండ నిది ద్వితీయపరాభవనాటకమున కొద్దికకాఁబోలు. కానిమ్ము. ఆనాఁటిలక్ష్మణుఁడు కాక వేఱొకలక్ష్మణుఁ డయ్యెనా యేమి ? చాలభయ మగుచున్నది. ఇఁక నెట్లు ? నేఁ దప్పించుకొనిపోవుటకుఁ బథమే లేదు కాఁబోలునే ?

ల:- దురభిమానరాక్షసకులకళంకమా! లేకేమి? కావలసినన్ని కలవు. అం దిదివఱకే యనుసరించిన దొకటి, యనుసరింపనున్నవి రెండు.

శా. రామాస్త్రంబులు నాదుబాణతతి వర్మంబు న్దొలుత్సేయ సం
గ్రామక్షోణిని వీడుపట్ల నిను సంరక్షించునామేఘము
ల్భీమంబౌ లయకాలుపోలిపథము, న్భీతాత్మత న్బారునీ
సామర్థ్యం బివె మూఢుడ్రోవ లిక వాచాశూర ప్రత్యక్షముల్.

ఈమూటిలో దేనిని మున్ముం దనుసరింప నిర్ధారణచేసితివో లేక క్రమముగ నన్నిటి నాశ్రయింప నెంచితివో తెలిపెదవా?

ఇం:- ఆహా! లక్ష్మణా! మంచిపథములఁ జూపితివి. ఒకటిమాత్రము చూపవైతివి. దానికిఁ బరమసంతోషము.

చ. ఎదిరి రణంబొనర్చుచు జయింపఁగవచ్చును, లేక క్లిష్టమౌ
యదనునఁ బారి శత్రువరు లద్భుతమందఁగ డాగియుండి, స
త్వరదరవరాళి ముంపఁగనువచ్చును, నీవలె బైసిమాలి న
ల్లఁదడిసి మూర్ఛ మున్గనుగ? లావుగలాఁడవె యీపథంబునన్.

ఉ. వాసుకిఁ బోలుమద్విశిఖపంక్తి భవత్తనువు న్జకాచకల్
సేసిన రక్తచిహ్నములు లేశము మానిన మానవచ్చు, నీ
వే సమరం బొనర్పఁగను వెట్టివె? యింతటిలోనె శౌర్యపు
న్మోసులుపుట్టెనే? యహహా! మూర్ఖ! శతారికులాబ్ధి ఫ్వేళమా!

ల:- మేఘనాదా! ఇంతకుముందు నీకాలము బాగుగనుండె. కావున నీమాటలు చెల్లివచ్చె. ఇఁక నీతోడ మాటాడఁజనదు. నాబాణం బులే నీకు బుద్ధిఁజెప్పును.

మ. సరి.కలఁగ న్దిగ్దంతులెల్ల న్గడగడమని రిక్షల్పుభవి న్వ్రాలఁగా,భూ
తలమెల్ల న్గంపమొంద, న్దహానునిగతి ని న్దారుబాణాగ్నిలోన
న్పలభంబ ట్లీవు మగ్గ, న్సకలసురవరు ల్సంతసం బందులీల
న్నలుప న్దోతెంచుబాణాశనుల నెదుర నీశక్యమొకో? దురాత్మా!

(శరసంధానము నటింప నింద్రజిత్తు వీఁపుఁజూపక వెనుక వెనుక కేగుచుఁ దెరచాటునకుఁ బోవును.)

వి:- ఆహాహా! జగములఁ గలశూరలోకమును గడగడలాడించు సౌమిత్రిబాణపరంపర యీతనినైపుణియెదుట దుర్మార్గునియెడ నొసర్చు హితోపదేశంబుపగిది నిరర్థకమైనను, జీకాకుమాత్ర మొనర్చివైచినది. ఆతఁ డెట్లో లక్ష్మణబాణపరంపరఁ బ్రత్యస్త్ర ప్రయోగంబున వమ్మొనర్చి ప్రయాసతోఁ గొన్నిబాణంబుల రామానుజునిపై గుప్పుచున్నాఁడు. (లక్ష్మణునివైపు దృష్టి సారించి) బలే! ఇంద్రజిద్బాణమేఘుని బటాపంచ లొనరింప నీలక్ష్మణశరఝంఝానిలమే సమర్థము. రామానుజా! ఇంద్రజిత్తు చికాకుపడియున్నాఁడు. వీనియెడ సామాన్యాస్త్రంబు లుపచరింపవు.

గీ. ఇంద్రజి త్తింద్రజి త్తేఁడి యేఁడి యనుచు
దూణముననుండి తలయెత్తి దుముకుచున్న
దదిగో జంభాసురాగిదివ్యాస్త్రవరము
వీరవర! చాపవరమున వేగఁ గూర్పు.

ఇం:- (సరభసమునఁ బ్రవేశించి తెరప్రక్కన నిలిచి)

సీ. కాదు నీటంకారగరిమను దిక్కరు ల్గలఁగుట నాసింహగర్జఁగాని
కాదు నీబాణధగద్ధగచే నుడుపాతంబు నాదృష్టిఁ బడుటఁగాని
కాదు నిన్గాంచి భూకంపంబు కలుగుట నను మెచ్చునా*మామతనివిఁగాని
కాదు నీమన్కి నీమేదురబలమున వనజభవునివార్తవలనఁగాని

గీ. బాణపావకునికి శలభం బొనర్తు నిదిగో యైంద్రాస్త్ర మిప్పుడ రయసి కూల్తు
ననుచు బెదరించెదవు,చూతు నదియొ,లేక నీదుకూలుటయో యొండు నేఁడునిజము.

వి:- లక్ష్మణప్రభూ! ఆలసింపక యీయస్త్రంబు సంధింపుము.
'ఆలస్యా దమృతమ్ విషమ్'

ల:- గీ. కలనయిన రాముువాక్యంబు గడువనేని
రామచంద్రుండు సత్యవాగ్రతుఁడయేని

* సులోచనజనకుఁడు, ఆదిశేషుఁడు.

నిర్జరాహితుఁ డైనయిన్నిచుశిరము
రామపాదాబ్జభృంగమై రమణఁగనుత.

(ఐంద్రాస్త్రప్రయోగ మొనరింప నింద్రజిత్తు తెరచాటునఁ బడును) (తెరలో)

పంచపాది గీ. తేటిచూడఁగరాని దేదీప్యమాన
కాంతిమంత మైంద్రాస్త్ర ముగ్రతను దాకి
యింద్రజిచ్ఛిర్ష భృంగంబు నినకులేశు
పాదపద్మంబులను, సవ్యపాణి భార్యఁ
బిలువఁగ సులోచనాంకంబుఁ బ్రీతిఁ జేర్చె.

వి:- శ్రీరామరామ ! ఎంతకష్ట మెంతకష్టము ! నావంశ మిట్లు క్రమ క్రమముగఁ గ్రుంగుచున్నదికదా ! తల్లీ సులోచనా ! నీయెడ నెంతద్రోహ మొనర్చితిని ! అమ్మా ! నాయెడ నించుకయు దోసము లేదు. ఇంద్రజిత్తు నామాట వినక స్వయముగనె మృత్యువును వరించె. నే నేమిచేయుదు ?

ల:- విభీషణా ! దుఃఖించుచున్నాఁడవా ?

వి:- సౌమిత్రీ ! ఈమూర్ఖునకై కాదుగాని యసూర్యంపశ్య యగు నాయనుంగుకోడలు సులోచనను దలఁచి దుఃఖించుచుంటి. మహాప్రభుని దర్శింపఁబోవుదము పద.

(విభీషణలక్ష్మణులు నిష్క్రమించుచుండఁ బటాక్షేపమున యుద్ధోచితవేషముతో రావణుఁడు ప్రవేశించును)

రావ:- వంశద్రోహీ ! విభీషణహతకా !

ఉ. ఆలినిఁ గోలుపోయినమహార్తి కుద్ధాకృతిఁ డాల్ప శాత్రవు
న్నేలకుఁ గోలకు న్బనుచు నేర్పునఁ దమ్ముని, నాత్మజాతునిం
గాలునిపోరికి న్బనుచుక్షత్రియుఁ గూడియు నాదురధ్యము
ల్గాలఁగ నేతె? యిప్డెకనుఁగొమ్ముకృతాంతనిశాంతమార్గముల్.

(శక్తింద్రిప్పుచు) అశనితుల్య మగునీశక్తి నీయసువులం
బాపి రాక్షసకులము నిష్కళంక మొనరించునుగాక. (విసరును)
(లక్ష్మణవిభీషణులు ప్రవేశింతురు)

లః- (స్వగతము) రావణుండు విసరిన యీశక్తి మిఱుమిట్లుగొలుపుచు భయంకరార్భటిని వచ్చుచున్నది. ఇది విభీషణునిం దాకిన నతండు మనునది రిత్త. కావున నాఘోరబాణంబుల దీనిం దుత్తునియలు కావించి యగ్రజునిచే నభయపట్టాభిషేకంబుం బొందిన విభీషణుని గాచుటయే కర్తవ్యము. (బాణప్రయోగము నటించును) విభీషణా! వెఱవకు. వెఱవకు. నేనుండ నుండ నీ కేటిభయము? ఆఘోరశక్తిగతిం జూచితివా?

విః- సౌమిత్రీ! అమోఘంబు లగునీబాణంబులతాకున నది తుత్తునియలై నేలంబడుచుక్కలట్లును దోంకచుక్కవిధమును బొందినది.

లః- అగును. దానిపాటుతో నదరిపడి విస్ఫులింగములం గ్రుక్కు నరుణనేత్రాంచలాంచితుండై యతండు మఱేమో యనుచున్నాండు. నీవు నావెనుకకు రమ్మావలం జూతము. (లక్ష్మణుండు విభీషణుని ముందు నిలువంబడును)

రావః- ఓరిమదాంధా! లక్ష్మణా! ఎంతకు సాహసించితివి? ఫల వృక్షమునకు సోకినచీడపురుగును దీసివేయునటుల నీదానవకుల కళంకుం డగునీతని మ్రిందింపం బంపినశక్తిని వమ్మొనర్చితివా? కాచుకొనుము. కాచుకొనుము.

గీ. అనుజురూపంబుం దాల్చినయహితు మృతిని
దప్పంగాం జేసినట్టిని ద్దండ్యు నిపుడె
యప్రతిహతంబు మయదత్త మైనశక్తి
చేత మ్రిందించి కడు సంతసించువాండ.

(అని శక్తిని వైచును. తెరలో)

గీ. ఆడి తప్పనయేనిం, బితాజ్ఞ సతము
సలుపుదునయేని, మయదత్తశక్తి వ్యర్థ

మ య్యెడినిగాక, సౌమిత్రి కగునుగాక
శుభము, ధరణికిఁ గల్గుత శోభనంబు.

(శక్తి తాకి లక్ష్మణుఁడు మూర్ఛిల్లును)

వి:- అమోఘవచస్కుం డగుశ్రీరామచంద్రుఁ డిచటికే వచ్చుచున్నాఁడు. ఓపాపమయదత్తశక్తీ! నన్నుఁ దాకక శరణాగతత్రాణబిరుదాంకితుఁడైనరామచంద్రునిమాట నిలుప నా కడ్డుపడిన లక్ష్మణు నాహుతిఁజేసికొంటివా? నన్నేల తాఁకవైతివి! ప్రాణంబులఁ దృణప్రాయముగ నెంచుసర్వసుగుణాలంకారు లగునుత్తమక్షత్రియులు దప్పనీ కొరులు రుచింపరా? నిన్ననుకొనిన నేమిలాభము? అయ్యో! ఈసమీపించు రాఘవేంద్రునెట్లోదార్పఁగలను? దుర్భరము. దుర్భరము.

శ్రీ:- (ప్రవేశించి) ఆహా! అనుజా! ఈమయదత్తశక్తి బారినుండి విభీషణునిఁ దప్పింపఁబోయి నీవే ప్రథమకబళమైతివా? అకటా! సకలగుణగణాలంకారుండవును రూపవిజితపంచశరుండవు నగు నీ కాయ మీధూళిఁ బొరలవలసివచ్చెనే?

మ. శరణున్బొందినవానిఁ గాచుటకునై స్వప్రాణము న్వీడఁగా
  నురగన్బూనియకుంఠశౌర్యము రణక్షోణి న్బ్రధాయయ్యె; నీ
  శరసంధానము నీయచింత్యపటుదోస్సారంబు, నీ శత్రుసం
  హారణప్రౌఢిమ విస్మరింపవశమే? యన్నా! సుమిత్రాత్మజా!

ఏమి యీపామరత్వము! శౌర్యప్రధానముగ వైరిశిరఃకందుకక్రీడ సలుపవలసినపట్టున, ధైర్యనాశనకారి యగుశోకము నన్నాక్రమింపనెంచుచున్నది. శోకమా! నీకు సమయాసమయములు లేవా? ప్రియానుజుని, శౌర్యఘనుని, సుగుణాలవాలుని, పరోపకారపారీణుని, సౌందర్యమదనుని దనశక్తి నేరఁజేసి జయోల్లసితవదనుం డగుశత్రుసమక్షముననా యసహాయపరాక్రమ ధైర్యధనమును జూఱఁగొనఁ దెగించుట? నీకు నా బాణాలింగనమున రావణాగ్రజత్వపదవి నొసంగకమున్నే నను

బాసిపొమ్ము. సుగ్రీవహనుమంతులారా! నే రావణునితోఁ బోరివచ్చువఱకు మాలక్ష్మణుని బ్రాణ మొకయెత్తుగాఁ గాపాడుచుండుఁడు. నే నిప్పుడే వత్తును. ఓరీ! రావణా! కుట్రవానిని గాదు, మూర్ఛిలఁజేయుటకు. రమ్ము. నాబారిఁబడి యెటుపోవఁ గలవో చూచెద.

ఉ. నీదుహితంబు దెల్పురజనీచరసోదరుని, న్కృతజ్ఞతన్
సాదరమొప్పఁ జూడకయె జాల్ముఁడ! కాలను దన్ని పంపినన్
నే దయఁ జేరఁదీసి కరుణించితి నాకయి యివ్విభీషణుం
బ్రోదియొనర్చుతమ్ము నిట మూర్ఖుఁడ పొట్టను బెట్టుకొంటివా?

సీ. ఒకజాడ జ్యారవ మురముఁ జెదరఁజేయుఘోషంబునను గలగుండుపఱుప
నొకదెసఁ బ్లవగేంద్రహుంకారసింహనాదంబులు కర్ణజ్వరంబుఁ గూర్ప
నొకచక్కిఁ జచ్చిచావక మూల్గు రాక్షసదారుణస్వనము చింతను ఘటింప
నొకవైపు నీపాత ముత్సహించెడిమునిశాపము ల్నీమానసంబుఁ గలఁపఁ

గీ. దమ్ముకుఱ్ఱఁడు, సుతులుఁ గృతాంతనిలయ
మునకుఁ జనఁ, గొమ్మ లెడలిన మోడువోలె
వచ్చితివి సంగరమొనర్చువాఁడువోలె
వ్యర్థపడఁబోని రాఘవప్రదర మిదిగో.

(బాణమోక్షణమొనర్ప రావణునిపతాక, కిరీటములు, ధనుస్సు ముక్కలై కూల రావణుఁడు శ్రీరామునివంక దీనముగఁ జూచుచు మూర్ఛిల్లును)

శ్రీ:- (మందహాసంబున స్వగతము) ఆహా! వీనియాశయ మమోఘము. న న్నెల్లని డాయఁ బట్టుఁబట్టి సకలైహికవ్యామోహముల వీడి యీషణత్రయముఁ దృణప్రాయముగఁ జూచి యాకారముఁ దాల్చినశాద్రిసంబోయన నొప్పుచున్నయీతని ననుగ్రహించి యీదేహంబు వాపి సాయుజ్యమొసంగ బుద్ధిపొడముచున్నను విభ్రాంతుఁడై నిరాయుధుఁడై మూర్ఛిల్లినవానిఁ దునుము రణ ధర్మం బొప్పకుండుట ననుష్ఠితసకలధర్ముండ నగునాకుఁ జేయఁ దగినకార్యము కాదు. వీని నిప్పుడే చంపిన నింకను గొంతరాక్షస

సేన కలదు. అది మడిసినఁగాని వీనిఁ జంపఁజనదు. (ప్రకాశముగా) అడుగో రావణసారథి. మూర్ఛితరావణయుక్తముగ రథము దవ్వుగఁ గొనిపోవుచున్నాఁడు. సమయజ్ఞత యిట్లుండవలదా ? ( సారథి రావణునితో నిష్క్రమించును ) నేను మా లక్ష్మణుని యొద్దకుఁ బోయి వానిగతి యోజింపవలయును. (పరిక్రమించుట నటింపఁగాఁ దెర యెత్తఁబడును.) (మూర్ఛితుఁడగు లక్ష్మణుఁడు, సుగ్రీవాంజనేయసుషేణు లుందురు.)

శ్రీ:- సుషేణా ! లక్ష్మణుఁ డింకను మూర్ఛాగతుఁడై యున్నాఁడా ? ఇం కేమిగతి ? మాతండ్రిని బ్రదికించు నుపాయమే లేదా ? కట కటా !

క. పురమునఁ బురమున దారలు
పురమునఁ బురమునను బంధువు లెసఁగుదురు, సో
దరులు కలుగుదేశం బే
పెరవున సమకూరుఁ ? దెలుపవే యర్కసుతా !

ఉ. ఏవిధి దాటువాఁడఁ దరియింప నశక్యపుశోకవార్ధి ? నిం
కేవిధిఁ బంక్తికంఠు సమయింతు ? జయం బొకవేళఁ గల్గని
ష్మేవిధిఁ గాంచువాఁడ జనయిత్రి సుమిత్రను సిగ్గులేక ? యీ
ధీవరుఁ డైనలక్ష్మణుఁడు దీనదశ న్గని యిట్లు కూలినన్.

సుషే:- మహాప్రభూ ! దుఃఖ ముడిగి లక్ష్మణునిలక్షణంబుల గమనిం పుఁడు. (నిదానించి చూచుచు) గుండె యించుక కొట్టుకొను చున్నది. నాడి యాడుచున్నది. జీవకళ మొగమును వీడలేదు. ఎట్లయిన నాలస్య మొనర్చినఁ బ్రమాదకరమే. ఇక్కడి కచింత్యా నంతదూరమునఁ గలద్రోణాద్రిం గలసంజీవకరణిఁ దెచ్చి సూర్యో దయ మగునంతలో నీతని కాఘ్రాణింపఁజేసిన నీతఁడు మనును. లేకుండిన మనకు దక్కుట దుర్లభము.

శ్రీ:- సుషేణా ! అది వచ్చుటెట్లు ? మన కీతఁడు దక్కు టెట్లు ?

సుషే:-మహాప్రభూ! కామధేనువును ముందిడుకొని యెచటనో వెదకి కొననేల ?

చ. ఎవఁడుమహోగ్రుఁడై చునుదయించెడిభానునిబంధుఁజేసె ము,
న్నవల నెవండు భానునుదయాస్తనగంబుల రెంటఁ గాళ్ళమో
పువసతుల న్బొనర్చెను, వపుర్ద్యుతి మేరువు మించె నెవ్వఁడా
జవయుతుఁడైనపావనియె చాలఁడె యీపని కుత్సహింపఁగన్.

శ్రీ:- జగత్ప్రాణపుత్రా ! ఆంజనేయా ! లెమ్ము.

ఉ. జ్ఞానివి సర్వసిద్ధుల వశంబొనరించుటఁ గార్యభారము
న్బూని వహింపఁగాఁగలుగు ప్రోడవు వైరికులాంతకుండవున్
మానసవేగము న్గెలుచుమాన్యుఁడ విప్పుడ తెచ్చి మూలికన్
భానుఁడు తూర్పుకొండ కెగఁబ్రాకెడిలోపలఁ దమ్ముఁగావవే.

హ:- మహాప్రభూ ! తమపదదాసుఁడు కైంకర్యమునకు వెనుదీయునా ? తమసంపూర్ణానుగ్రహ మీకింకరునిపట్లఁ గలుగునంతవఱకు వీని కసాధ్య మేదియు లేదు. తెల్లవాఱులోపల సంజీవిఁ దెచ్చి లక్ష్మణుని బ్రదికించెద. (సాష్టాంగదండప్రణామ మొనర్చును)

శ్రీ:- చిరంజీవ. విజయోఽస్తు.

హ. ఉత్సాహ. రామ రామ రామ రామ రామ రామ రామ శ్రీ
రామ ! వైరిభీమ ! సర్వరాక్షసాంతకా ! ముని
స్తోమగీయమాననామ ! సూర్యవంశరత్నమా !
రామ ! భూమిజాభిరామ ! రాఘవా ! బలప్రదా !
శ్రీరామచంద్రప్రభువునకు జై (పెద్దపెద్ద గంతులతో నిష్క్రమించును)

శ్రీ:- ఆహా ! లోకవృత్త మెంతదురూహ్యము !

గీ. ధరణి నెయ్యది తామరతంపరగను
బెఱుఁగు నయ్యదియే తుది విఱుఁగుచుండు
శౌర్యమున కిక్క యైనలక్ష్మణకుమారుఁ
డీకటికనేల మూర్ఛిలు టిట్టిదెకద !
నైజముకూడ నట్టిదే. ఎట్లన.

గీ. అగ్ని వాయుభయంబు లయ్యంబరంబుఁ
దాకు మేడల, కున్నత తరువితతికె
సమతలంబు, పాతాళంపుచాయఁ గలదె
భయము ప్రజ లట్టు లున్న తాశ్రయము కాదె ?

తమ్ముఁడా ! నాకు దూరమైతివా ? నాకొఱకు సకల రాజ్యభోగంబుల వీడి కాననావాసంబున నతిరుచ్యఫలంబుల నను దినంబుఁ దెచ్చుచు నతులభక్తి జూపిన నిను మఱచుటెట్లు ?
(మూర్ఛిల్లును. విభీషణుఁడు ప్రవేశించును)

వి:- శ్రీరామచంద్రు నెట్టిదురవస్థఁ జూడవలసె ? ఆంజనేయునిపోల కువ యింకను దెలియకున్నది. కార్యసాధకుఁడు కృతార్థుఁడైయే రాఁగలఁడు. మహాప్రభువు కదలుచున్న ట్లున్నాఁడు.

శ్రీ:- (మూర్ఛ తెలిసి లేచి యాతురతతోఁ దూర్పువైపు పరికించి) అయ్యో ! ఉషఃకాలముకూడ నగుచున్నట్లున్నది. హనుమజాడ కానుపించుట లేదే ? నాతమ్మునిబ్రదుకు సందేహాస్పదముగాఁ దోఁచుచున్నదే ? అయ్యో ! అయ్యో ! ఇఁక నేమున్నది ?

చ. కలకలశబ్దము ల్సెలుపఁగాఁ దొడఁగె ద్విజపాళి, రిక్కలుఁ
వెలవెలఁ బారుచుండె, వినువీధి భయంకరశోణదీప్తిచే
వెలిఁగెడి, నగ్నిగోళమన వేఁజనుదెంచెడి శీఘ్రగామియై
జలజహితుండు, కట్ట! యనుజన్ముఁడు తేఱునో తేఱఁడోకదా!

(ప్రచండకోపంబున) సర్వజగత్సంక్షోభ చణకోదండంబు నా కరంబున వెలుఁగొంద నొకరిలెక్క యేమి ? స్వకులాభిమాన శూన్యుఁ డగుభాస్కరునకుఁ గఱకుటమ్ముననే నీతిఁగఱపెద.

చ. తనదుకులంబువారలు వెత న్బడుచుండఁగ నేదొ సాయముఁ
బొనరుచు టొప్పుఁగాని,యరిఁబోలెను గాలముఁదప్పివచ్చి,యా
వనటను మున్గువారలకు బాధలఁ గూర్చుట న్యాయమానె యో
యినుఁడ ! ధరాస్థలి న్దొరగనేసెద నిన్నిదె మచ్ఛరాహతిఁ.

సుగ్రీవా ! ధను విటు తెమ్ము.

సు:- (భయాద్భుతము లభినయించుచు) రఘువీరా! శాంతస్వరూపుఁడ వగునీ కీత్వర యేల? కోప ముడిగి యావైపు చూడుము.

సీ. అఱనిద్ర వాయుసంహతి బొబ్బటింతలఁ గలవరించు శకుంతగణరుతంబు
తమకాంతులను మ్రింగఁ దారసిల్లెడువానిఁ గని తెల్లవడిన చుక్కలవిధంబు
తన్ను వేగమునఁ దాకిన నోర్చుకొన ధృతి కుంభించి యరుణిమఁ గొన్న నభము
తనశిష్యునుద్ధతిఁ గనవచ్చెనను పురోగామియౌ సాంధ్యరాగద్యుతియును
గీ. తలపఁగ నశక్యజవమునఁ దమ్ముఁ జేర
వచ్చు మనయాంజనేయుండు తెచ్చుచున్న
యౌషధనగంబు కాంతియే యగును గాని
యగ్నిగోళంబు రవి కాఁడె? యతులతేజ!

(తెరలో) శ్రీరామచంద్రప్రభునకు జై. వీరాంజనేయునకు జై.

శ్రీ:- (ఆతురతతో నెదురేగఁగా ద్రోణాద్రితో హనుమంతుఁ డెదురుగాఁ బ్రవేశించి కొండ నట దింప హనుమంతుని శ్రీరాముఁడు కౌఁగిలించుకొనుచు) నాయనా! హనుమా! కృతప్రతిజ్ఞుఁడవై వచ్చితివా? తండ్రీ! (ద్రోణాద్రిని జూచి) నాయనా! ఇది యేమి? సంజీవకరణిఁ దెమ్మనిన ద్రోణాద్రిఁ బెఱికి తెచ్చినాఁడవు?

హ:- మహాప్రభూ! సంజీవి వెదకుట తడవగునని నగంబునే పెఱికి తెచ్చితిని.

శ్రీ:- సుషేణా! చూచితివా హనుమంతుని శౌర్యము. చూచిరమ్మనినఁ గాల్చివచ్చినాఁడు. ఇఁక నాలస్యముఁ జేయక సంజీవకరణి లక్ష్మణున కాఘ్రాణింపఁ జేయుము.

సుషే:-(సంజీవకరణిని లక్ష్మణున కాఘ్రాణింపఁజేయును) లక్ష్మణుఁడు కనులఁ దెఱచును)

ల:- ఏఁడీ మనవిభీషణుఁ డేఁడి? ఏఁడీ యారావణుఁడు? ఆశక్తి విభీషణునిఁ దాకలేదుకదా?

శ్రీ:- (లక్ష్మణుని బిగ్గఁ గౌఁగిలించుకొని మూర్ధ మాఘ్రాణించుచు)

తమ్ముఁడా! బ్రదికితివా? ఆంజనేయుఁడు మనకై పడినశ్రమ మునకు మన కాతఁడాజన్మస్మరణీయుఁడు.

వి:- (లక్ష్మణునకు నమస్కరించి) మహాప్రభూ! మీకారుణ్యంబున నే సుఖిగా కెట్లుందును? చావనున్ననా కడ్డుపడి మీ రీపాటను భవించితిరి.

ల:- (లేచి శ్రీరామునకు నమస్కరించును)

శ్రీ:- దీర్ఘాయుష్మాన్ భవ. తమ్ముఁడా! ఈహనుమంతుని కారుణ్యము, స్వామిభక్తి వర్ణనాతీతము.

గీ. దీర్ఘమూర్ఛలో దేహంబు తెలియకున్న
నీకు సంజీవిఁ దెచ్చుటకై కడంగి
తలఁపరానట్టిదవ్వునఁ దనరుద్రోణ
నగముఁ గొనివచ్చి బ్రదికించినాఁడు నేఁడు.

హనుమా! నీయొనర్చినయుపకారంబుల కెవ్విధి ఋణము దీర్చుకొందుమాయని చింతించుచున్నాఁడ.

హ:- మహాప్రభూ! అంతయంతఃకరణ మీకింకరునిపై మీకుఁ గలిగిన భవతరణనౌకయగుతమతారకనామము నాజిహ్వాగ్రమున ననవరతము తాండవమొనర్చున ట్లనుగ్రహింపుఁడు. ఇంతటికంటె వేఱేమి కావలయును?

శ్రీ:- తథాస్తు.

హ. ఉత్సాహ. రామ రామ రామ రామ రామ రామ రామశ్రీ
భూమిజామనోబ్జభృంగ! పుండరీకలోచనా!
సామజారివిక్రమా! ప్రశాంత! సద్గుణాలయా!
రామ రామ రామ రామ! రాక్షసాబ్జవారణా!
(నృత్యముఁజేయును)

(తెరలో)

గీ. తనదుబలమెల్ల సంగరస్థలిఁ గృశింప,
జయదమా యజ్ఞ మొండు వే సలుపుచుండె

రావణుం; డది ముసిగిన రణమునం ద
జేయుఁడౌ ; వాని నిఁక నేమిచేయఁగలరు ?

శ్రీ:- ఎవరి వా వాక్కులు ? (పరికించి చూచి) అవునవు నాపోవు చున్న విమానచరులవాక్యంబు లవి. ఆయజ్ఞంబు ముసిగిన నా కజేయుండగునని హెచ్చరికఁజేయుచున్నారలు. మహాత్ములారా ! మీ కెంతయుఁ గృతజ్ఞుఁడ. విభీషణా ! ఇపుడు కర్తవ్యము ?

వి:- ఇఁకఁ గర్తవ్యమున కేమున్నది ! అంగదహనుమ ల్లక్ష్మణాదులఁ బంపి యీ యజ్ఞము విఘ్నమొనరించి వాని యుద్ధమునకు లాగి చంపుటే.

శ్రీ:- విభీషణా ! కర్తవ్యము బాగుగ బోధించితివి. ఆలాగే చేసి వత్తము పద. (శ్రీరామవిభీషణులు నిష్క్రమింతురు, తిరిగి శ్రీరాముఁడు ప్రవేశించి) అదిగో అనుకొనినంత జరుగనే జరిగినది. యజ్ఞము విఘ్నమొందుట సక్రోధుఁడై రావణుఁ డిటకే సరభుఁడై వచ్చుచున్నాఁడు. ప్రక్కనుండి వానిరీతి గమనించెద (తెరప్రక్కకేగును) రావణుఁడు సరభసముగఁ బ్రవేశించి)

రావ:- రథమాసమతలంబుననే నిలిపివచ్చితిని. అహితుండికునివిధమున రామనాగేంద్రమును వీరాలాపనాగస్వరమున యుద్ధభూమి కాకృష్టునొనర్చి తలపడుచోటికిఁ గాళ్ళ నడువఁజేతు. ఏమి నా కీభ్రాంతి ? ఇంకను శ్రీరాముని జయించుటయా ?

ఉ. అచ్చపురాజభక్తిని హితాహితచర్చనుగూడఁ జేయకే
వచ్చి రణంబులో నెదురువైరులపీచ మడంపఁ బోరుచుఁ
జచ్చిరి సేన తోడ ననుజన్ముఁడు, సూనులు; వైరకారకుం
డిచ్చట మోడునా నిలిచె హీనత యింతటికంటెఁ గల్గునే ?

సైన్య మంతయుఁ బీనుఁగుపెంటలై కూలిన నిఁకఁ జేయునది లేక శుక్రాచార్యోపదిష్టమగుహోమ మొనరించి యందుద్భవించినదివ్యరథ, చాప, తూణీరయుతంబుగ నజేయుండనై యీ రాఘవుల మర్దింపనెంచ వానరచమూపతులచే నది

విఘ్న మొనర్పఁబడెను. దీక్షితుఁడనైనతఁడే కుపితుఁడను గాకుండ వలయునని యెంతప్రయత్నించినను నాయంగదకృత్యముగు మండోదరీపరాభవమును మండోదరీకర్ణకఠోరవాక్యంబులును నన్ను నఖశిఖాపర్యంతము నిలువున మండింపఁ గినుకవహించినంతనే చక్రములవఱకుఁ బై కుబికినరథము లోనికిఁ గ్రుంగిపోయె. గోరుచుట్టుపై రోఁకటిపోటు తాఁకినట్లు మండోదరీపరాభవమునకు నాపరాభవముఁ దోడ్పాటఁబరాభవములోఁగూడ భాగముఁబంచుకొంటిమి- (వికసితవదనుఁడై) ఎట్టిచెట్టయందు నేదో యొకశుభఫలితార్థ ముండకతప్పదు. ఆలాగే మండోదరీపరాభవముకూడ నా విముక్తికిఁ బ్రథమసోపానమై నాయం దాసాధ్వికిఁ గలమమకారలతాచ్ఛేదన మొనరించినది. మొదలిడఁబడిననామనోరథసౌధము రామపాతంబుననో లేక రావణపతనంబుననో కాని ముగియదు. (విషణ్ణుఁడై) అకటా ! ఏమి కాలవైపరీత్యము !

చ. జగముల, సర్వదిక్ఫలకజాలమున, న్నిశితాసిధార నిం
పుగ విజయాక్షరంబులఁ బ్రమోదమున న్లిఖియించి, యక్షప
న్నగసురసిద్ధసాధ్యసుమనోయమరూపుఁడనైన నాసతిన్
నగచరుఁ డొక్కరుం డొడిసిన స్గనుకాలము వచ్చె, నక్కటా!

ఇఁక నాలంకను గలకలలాడఁ జూడఁబోవనుగాఁబోలు. కానిమ్ము. ఏదో యొకత్రోవ దొరకినప్పుడు వికలమనస్కుఁడు కాక దానినే యనుసరించి కష్టించిన గమ్యస్థానముఁ జేరలేక పోవఁడు. ఇఁక నాదుఃఖము వీరముగా మార్చుకొనినఁగాని యా వైకుంఠుని సత్వరము చేరఁజాలను. ఇపుడు నాకు మారకదశకూడ సమీపించుచున్నది. సర్వప్రయత్నముల దానిచే సాయపడవలసినవాఁడనుగాన మూర్ఖుఁడవోలె నాశ్రీరామచంద్రు నెదుర్కొని నాశౌర్యంబు లోకైకవిఖ్యాత మొనర్చుకొందును. నాకొఱ కెదురుచూచుచున్న శ్రీరాముని బెద్దయెలుంగునఁ బిలిచి ఢీకొనియెద. (ప్రకాశముగ) ఓరామా !

చ. కులుకకు స్త్రీని, గోఁతిఁ, బరుగున్గోను లేడిని, గాళ్ళు లేక చే
తులు గల మొండెము న్బలిమిఁ ద్రుంచితినంచును, గుఱ్ఱకూనల
న్గెలిచితినంచు ; ని న్నెదిరి, గెల్చుతలంపున వచ్చినాఁడ, ని
న్దలపడ నాకె సి, గ్గయినఁ దప్పుమిచే నని చేయ వచ్చితిఁ.

(శ్రీరాముఁడు ప్రవేశించును)

శ్రీ:- గోబ్రాహ్మణలోకద్రోహీ ! పరస్త్రీలోలా ! రావణా ! వినుము.

సీ. నను నెదిర్చినవాని ననిఁ జంపితినిగాని పరకాంత దొంగిలింపంగ లేద?
అనుజానిల్లాలిఁ గైకొనువాలిఁ దునిమితిఁ బరకామినులఁ గూడఁబోవ లేద ?
మునులహితార్థమై తునిమితి లేడిని యజ్ఞవిఘ్నంబుఁ జేయంగ లేద ?
శాపహతుఁ గబంధు శాపంబుఁ బాపితిఁ జెట్ట నెవ్వరికిని జేయ లేద ?
గీ. క్షత్రధర్మసంస్థాపనచణత నన్నుఁ
జెనకువీరులు కొలునిఁ జేరఁజనిరి
కలఁగ నేటికి నీవు ! నీకాంక్షితంబు
గలుపనున్నాఁడ స్వస్థత నిలుచునట్లు.

రా:- నాయాకాంక్షితముకూడ నదియే. నీయొద్దఁబాసి యెపుడెపుడు స్వస్థతఁగాంచెదనాయని యువ్విళ్లూరుచునేయున్నాఁడ. నేఁటికిఁ జిక్కితివి. ఇంకెక్కడి కేఁగఁగలవు ? రమ్ము. సమరంబునకు దిగుము. (ఆకాశమువంకఁ బరికించి) అదిగో నిన్నో నన్నో స్వస్థత నందఁజేయ సురరథము మాతలిచోదితమై భూమి కవతరించుచున్నది. ఇంద్రుఁడు నాకష్టదశను గాంచి నా కింతకు వెఱచిన వాఁడగుట దివ్యరథము నాసహాయార్థము పంపుచున్నాఁడు కాఁబోలు. అది సమీపించుచున్నది. ఏమో మాతలి యనుచున్నాఁడు. (తెరలో)

గీ. రథమునం దొక్కరుండు ధరాతలమున
నొక్కరుఁడు నిల్చి పోరు టయుక్త మనుచు
వృత్రవైరి దేవరకు సంప్రీతితోడ
స్యందనముఁ బంపె నో రామచంద్ర ! వీర !

శ్రీ:- మాతలీ! సమయసహాయుఁ డగునాఖండలునకు మే మెంతయుఁ గృతజ్ఞులము. ప్రీతిచేఁ బంపినబహూకృతిఁ బరిగ్రహింపకుండుట వారియెడ నిర్లక్ష్యభావమగును. సురనాథునికోర్కెయే ఫలించుఁగాక. ఇదిగో వచ్చుచున్నాఁడను. రావణా! రథం బారోహించి సమతలంబునకు నడువుము. పోరితమే జేరుగుఁగాక. (రామరావణులు నిష్క్రమింప దీర్ఘదంష్ట్రుఁడు వృశ్చికరోముఁ డనునిరువురు రాక్షసులు ప్రవేశింతురు.)

దీ:- వృశ్చికరోమా! ఎదురుపడి ఢీకొనసున్న దానవనరేంద్రులకీవిఁ జూచితివా?

వృ:- అగునురా. భూతబేతాళవిగ్రహములతోఁగూడి గాడిదలచే లాగఁబడురథమునం దున్నమనచక్రవర్తి యెక్కడ? రావణు ధాటికిఁ దాళలేక తెలతెలవారినసూర్యునిపగిది నాయిందరథస్థుఁ డగు నానరాధముం డెక్కడ? హస్తిమశకాంతరము కలదు.

దీ:- అట్లీసడించెద వేమిరా! నరుఁడైన నేమి, వానరుఁడైన నేమి? మనము యుద్ధరంగమునఁ జూడవచ్చినది శౌర్యము. అది యేపట్లనున్నదో చూతము.

వృ:- అవునురా. బీరువోనిరామబాణము కోదండంబునుండి వెలువడినతరువాత విఱిగినతేరులా, సొరిగిపడినయేనుంగులా, కాళ్లు తెగినయశ్వంబులా, పండ్లభీకరంబునకుఁ గత్తి, డాలు పట్టుకొనిన వారలలోనెల్ల నొకచేతినో, యొకభుజమునో, యొకచెవినో, యొక కాలినో త్రెంచి రామరావణసంగ్రామమునఁ బాల్గొనినవీరుఁ డితండని శాశ్వతచిహ్న మొనర్చి చంపీచంపనిరీతిఁ గాల్బలంబుల నొనర్చి యంతటఁ దనివిఁగనక యొకటో రెండో రావణునిశిరంబులఁ ద్రెంపి భూమిఁ జొచ్చి తిరిగి యామహావీరుకవదొనఁ జొచ్చి మరలఁ బ్రయోజనమునకు సిద్ధపడనిబాణమే లేదు. అబ్బా! పోరెంత ఘోరముగ నున్నది!

దీ:- అవునురా వృశ్చికరోమా ! మనచక్రివర్తిగారితలలు కొండల కోట్లగాఁ గుప్పలు పడినను దెగునది తెగఁగా సారవంతమైనభూమిని బండెడిపంటవలె నొకటి కూలులోపల మఱొకటి మొలచుచున్నది. దీనికిఁ గారణమేమి ?

వృ:- ఓరిదేబే ! రక్కసుఁడవై పుట్టితివేకాని యిది నీకుఁ దెలియ దఁటరా ? మహారాజుగారి నాభిస్థానమున నమృతకలశము లేదటా్రి ! దానిమహిమ యిది.

దీ:- ఓహో ! అవునురా. నేను మఱచితిని. ఈసంగతి శ్రీరామునికిఁ దెలియదుకాఁబోలు.

వృ:- తెలియకయే యిట్లు సముద్రపునీళ్ళ గంటెలతోఁ దోఁడునట్లు తా నలసియు నూరక తలల నేలఁగూల్చుచున్నాఁడు.

దీ:- శ్రీరామయ్యతో నేదో మాటాడుచున్నయాఋషి యెవరు ?

వృ:- ఆయన నెఱుఁగవటరా ? సముద్రాన్నంతా ఆపోసనం పుచ్చుకొన్న అగస్త్యయ్యకదా ! ఆయననే యెఱుఁగవటరా ? చూచితివా శ్రీరాముఁడు కాలుసేతులఁ గడుగుకొని సూర్యునిదిక్కై యేదో జపముఁజేయుచున్నాఁడు. ఈజపములేకదటరా మనకత్తి కటారులను మించి రాక్షసులయాండ్లతాళ్ళు తెంచడం.

దీ:- అదేందిరో చాపము నెత్తఁబోవుచున్న శ్రీరామయ్యకు విభీషణయ్య యేమో చెపుతున్నాఁడు !

వృ:- అయ్యో ! అయ్యో ! ఇంకే ముందిరా ! అమృతకలశంగుట్టు బైటబెట్టాడురా బాబూ ! రహస్యం దెలుసుకున్నవాఁ డెంత సంతోషముగా రావణాసురయ్యనాభికి గురిపెట్టుచున్నాఁడురా ! హా చచ్చితిమిరా. చచ్చితిమిరా. మనము రావణపక్షపాతులమని తెలిసెనా యీ కోతిముండాకొడుకుల బారిపడి తప్పించుకోలేం. పరుగెత్తుదాం పద.

దీ:- ఓరివెఱ్ఱిపీనుగా ! నే నుపాయంజెప్తా లేరా ! కాళ్ళకు శ్రమ, మనస్సుకు భయంలేని వుపాయం. శ్రీరామయ్యనుగాని విభీష

ణయ్యనుగాని శరణుశరణంటిమా మనమీఁద నీఁగ వాలదుకదా సిగపువ్వుకూడ వాడదు. (వెన్నుఁదట్టుచు) భయము లేదు. భయము లేదు. నిలు. అరుగో విభీషణప్రభువు వచ్చుచున్నారు. శరణుఁజొత్తుము. (విభీషణుఁడు ప్రవేశించును)

వృ. దీ:- జయము జయము మహాప్రభువులకు. శరణు శరణు మహాప్రభూ !

వి:- శరణార్థుల కభయము.

దీ. వృ:- బుద్ధి బుద్ధి సెలవు.

వి:- సుఖముగఁ బోయిరండు.

(దీర్ఘదంష్ట్ర, వృశ్చికరోములు నిష్క్రమింతురు)

వి:- ఆహా ! భువనము లెంతసంతోష మనుభవించుచున్నవి !

చ. కలకలలాడఁగాఁ దొడఁగెఁ గంజహితుండు, సురాగసూనము
ల్జలజలవ్రాల్చె నచ్చరలసంతతి, దుందుభి మ్రోయఁజొచ్చె, ని
శ్చలుఁడగురామచంద్రుఁడువసంతపుఁబెండ్లికుమారుఁడయ్యెఁగా
తొలఁగెను రావణవ్యథ; విధూతమునై భయ ముర్విఁబాసెఁడిఁ.

(దుఃఖముతో) ఏమైననేమి ? నే నెంతచెప్పిన నామూర్ఖుఁడు విననేరక కడ కీగతిఁ దెచ్చుకొనియె. నే నేమిచేయఁగలను ?

గీ. సంతతం బంధకారాతిచరణనీర
జార్చనమునఁ బూతంబులై యమరినట్టి
యగ్రజు శిరంబు లకట ! కంకాదిపక్షి
పాదములచేత దొరలింపఁబడుచునుండె.

శ్రీ:- (ప్రవేశించి) లంకేశ్వరా ! అగ్రజునికై విలపించుచున్నావా ?

వి:- మహాప్రభూ ! లోకకంటకుఁడును బైపెచ్చు నన్నుఁ బరాభవించుటఁ బ్రత్యక్షశత్రువై నవీనిమరణమునకై చింతించుటలేదు కాని వీనిదుస్థితికై విచారింపక తప్పినదికాదు.

శ్రీ:- విచారము కార్యకారి కాదుకదా ?

వి:- అయిన నేమియాజ్ఞ ?

శ్రీ:- విభీషణా ! శోకం బుడిగి 'పితృసమో జ్యేష్ఠ'యందురు; కావున లేచి సత్వర మీతనికిఁ జితివిధి సక్రమంబుగ నెఱవేర్పుము.

వి:- మహాప్రభూ ! ఒక్కమనవి. తమపవిత్రహస్తమున మడియుట నీమూర్ఖునకు వైకుంఠప్రాప్తి సిద్ధించియుండ నిట్టివానికిఁ గ్రమ్మర నీచితివిధి యేల ? యోజింపుఁడు.

చ. పరవనితారతుం, డనృతభాషణతత్పరుఁ, డగ్రజాకృతిం
బరఁగినగర్భవైరి, సురవంచనశీలుఁడు, తమ్ముఁ దద్దితం
బరసిననన్నుఁ బాదమున నవ్వలికి న్బడఁదన్నినట్టిము
ష్కరునకు నగ్నికార్య మెటుసల్పుదు? ధర్మవిధిజ్ఞ! తెల్పుమీ.

ఈతనిచరిత్రము వినినవారు నేను దప్పొనరించిన ట్లెన్నఁడు నెన్నరు.

శ్రీ:- విభీషణా ! నిజమే. కాని యిది లోకముకదా ? రాజు కర్మిష్ఠియై లోకమున కాదర్శప్రాయుఁడు కావలెను. మఱియొకటి. 'మరణాంతాని వైరాణి'. ఇతఁడు కూలెను. మన కఖండవిజయము కలిగె. నీహితంబుఁగోరునావాక్యానుసార మీతని కంత్యకృత్యములఁ దీర్చి కీర్తికాముఁడవు కమ్ము. దీనియంత్యమున నిన్ను లంకారాజ్యపట్టభద్రు నొనరించి సత్వర మేగవలయు.

వి:- చిత్తము. మహాప్రసాదము.

(యవనిక జాఱును)

శ్రీ

# శ్రీ రా మ వి జ య ము

## చతుర్థాంకము



(లంక - శ్రీరామలక్ష్మణు లుచితాసనాసీనులై యుందురు. హనుమంతుఁడు ప్రవేశించును)

హ:- శ్రీరామచంద్రమహాప్రభునకు జై. (సాష్టాంగము నమస్కరించి లేచి వినమ్రుఁడై) మహాప్రభూ ! తమయాజ్ఞానుసారము విభీషణ మహారాజుగారియనుమతిఁ గొని యశోకవనంబునఁ గలజగన్మాత యగుదేవరదేవేరిని దర్శించి తమవిజయోదంతమును, రావణుని మరణవిధమును విభీషణపట్టాభిషేకవిషయము విన్నవింప నాదేవి యెంతయు హృష్టయై తమదర్శన మపేక్షించెను. (పరికించి) అరుగో విభీషణమహారాజుగారు వచ్చుచున్నారు. (తెరలో-శ్రీరామచంద్ర మహాప్రభునకు జై.) అరుగో వారు ద్వారమును సమీపించుచున్నారు.

శ్రీ:- లక్ష్మణా ! విభీషణునిఁ దోడ్కొనిరమ్మి.

ల:- (నిష్క్రమించి పట్టాభిషేకోచితవస్త్రాలంకృతుల నొప్పి యున్న విభీషణునితోఁ బ్రవేశించును.)

వి:- శ్రీరామచంద్రమహాప్రభునకు జై (సాష్టాంగదండప్రణామ మాచరించును)

శ్రీ:- చిరంజీవ. సుఖీభవ. లంకేశ్వరా ! ఆయాసన మలంకరింపుము. (విభీషణుఁ డాసనముపైఁ గూరుచుండును) విభీషణా ! మారుతి

ముఖంబున నావిజయవృత్తాంత మెఱింగిన జానకి ననుఁగాంచ వాంఛించెనఁట. నీ వేగి యామెను మంగళస్నాత నొనర్పించి యంగరాగభూషణాలంకృత నొనర్పించి యిచ్చటికి సత్వరము పిలుచుకొనిరమ్ము.

వి:- మహాప్రసాదము (వెనుకకుఁ జనుచు నిష్క్రమించును)

శ్రీ:- లక్ష్మణహనుమంతులారా! జానకికై హజారంబున వేచియుండుఁడు.

ల.హ:- మహాప్రసాదము. (నిష్క్రమింతురు.)

శ్రీ:- జానకి యసమానపతివ్రతయనియుఁ,ద్రికరణశుద్ధిగ ననవరతము నన్నే ధ్యానించుచుండుననియు నే నెఱుఁగుదు. కాని యీలోక మట్లు తలఁపదు. కామియైన విరోధియింటఁ బెద్దకాలముఁ గడపిన కాంతను గాముకుఁడై శ్రీరాముఁ డంగీకరించెనని యందురేకాని యామెనిశ్చలభావము వారి కేమియెఱుక?

గీ. ఘర్షణంబుననేకాని ఘనులగుణము
మఱినుళింపదు పుడమి సంభావ్య మగుచు
నఱుగఁదీసినశ్రీగంధతరువుభాతి
పుటము వేసినహేమంబుఁబోలె ధరణి.

కావునఁ గొంతదనుక నాప్రసన్నశాంతభావములఁ గోపంబున మఱుగుపఱచి జానకీసచ్చరిత్రంబును లోకంబునకు వెల్లడించి శ్రీరాముఁడు పరీక్షింపకయే జానకిని గాముకునిభంగిఁ బరిగ్రహించెనను దూరుఁ దప్పించుకొనెదఁగాక (పైకిఁజూచి) ఆగంధర్వమిథునము మింట నేగుచుఁ బ్రసంగించుపల్కులు వినియెదఁగాక. (ఆలించుట నభినయించి) ఆహా! యెంతసంతోషము! (తెరలో)

గీ. సరమ చనుదెంచి స్నానంబుసలిపి దివ్య
వస్త్రభూషణములను దాల్పంగవలయు
ననినఁ గాదని, ప్రాణనాథాజ్ఞ యనిన
వల్లె యను జానకీసాధ్వి పరమపూత.

శ్రీ:- జానకీ! ఇట్టిగంధర్వగీయమానపూతచరిత వగుని న్నర్ధాంగిగాఁ బడయఁగల్గిననేన ధన్యుఁడ. (తెరలో)

రాక్షసకపిభల్లుకసైన్యములారా! మహారాజ్ఞి జానకీదేవిగారి సముఖమున నుంటిరనుట మఱచి చరించుచున్నవారలు. ప్రక్కకొదిగి తా వొసంగి దూరముగ నిలువుఁడు.

శ్రీ:- ఇది లంకేశ్వరునివచనము. జానకి సమీపించుచున్నదికాఁబోలు.

ల:- (ప్రవేశించి) అగ్రజా! జానకీమాత వచ్చి తమయాజ్ఞకై వేచి యున్నది.

వి:- కన్నులు కానవచ్చుట లేదా? దారి యిండు. జయము జయము మహారాజుగారికి. దేవేరిగారు వచ్చినారు.

శ్రీ:- (అనాదరముగా) సరియే. ఏమి విభీషణా! నీకతో రాజ్ఞచే రాక్షసకపిభల్లుకసైన్యముల గగ్గోలుఁగలుగఁజేయుచున్నాఁడవు?

ఉ. ఎప్పుడు రావణుండు నశియించును? సాత్వికుఁడౌ విభీషణుం
డెప్పుడు లంక నేలు? నిఁక నెప్పుడు జానకి సాధ్విఁ గాంతుమం
చెప్పుడుఁ గోరుచు, న్గనుట కిచ్చుట మూగిననాజనంబులన్
దిప్పలువెట్టి దాజ్ఞనిడి తేకువ యిట్టిదె రాక్షసేశ్వరా!

శీలపరిధానలగుస్త్రీలకు మేలిముసుఁగులు, హర్మ్యంబులు, రాజలక్షణంబు లేల? ఇందున నొకధర్మసూక్ష్మము కలదు. దాని నెఱుఁగవో?

చ. సమరతలంబునందున, విపాదముఁజెందెడిచోట్ల, దేశపు
ణ్ణమరముపట్ల, యజ్ఞమునొనర్ప, స్వయంవరవేళల, న్వివా
హములను గాంతల న్గనుట న్యాయ్యము కావునఁ బ్రస్తుతంబు నీ
సమరతలంబులోన సతి జానకిఁ జూతురుగాక యెల్లరున్.

వి:- మహాప్రభూ! చిత్తము. బుద్ధి. బుద్ధి.

జా:- (శ్రీరామచంద్రునిసమీపించి కుంచితగాత్రియై నిలువఁబడును)

శ్రీ:- జానకీ!

చ. పదియును నాల్గులోకముల బాధల వేఁచి కలంచినట్టి బె
ట్టిదుఁడయి రాముభార్యను గడించిచెఱ న్బడవైచినట్టిదు
ర్మదు సమరాంగణంబున కెర న్బొనరించితి, క్షాత్రధర్మము
న్మదినిడి ; గాని, కామ్యమునమాత్రముకాదు విదేహనందనా!

ఉ. దానవుఁడై నరావణుఁడు తా నతికాముకుఁ డౌచు ని న్నిజ
స్థానమునందు నుంచెఁగ! నతండు నినుఁ స్పృశియింపకుండెనే?
చానరో ! నేను జేకొనఁగఁజాలను, ని న్విడనాడినాఁడ, నీ
కేనెల విచ్చయో యటకె యేగఁగవచ్చు వసుంధరాత్మజా !

జా:- (దుఃఖించుచు) హాప్రాణకాంతా ! పెద్దకాల మేకదేహముగ నేకవాసమున మెలంగిన నానడువడియే తమకు సందేహాస్పద మాయెనా ? మూర్ఛిత నగునన్ను రోహిణినిఁ గొనిపోవుబుధుని మాడ్కి నారావణహతకుఁడు గగనమున నెత్తికొనిపోవఁగలిగెనే కాని స్మృతిలో నుండఁగ నను స్పృశింపఁగలఁడా? ఇందఱిమెదుట నర్ధాంగినవమానపఱుపఁదలఁచితిరా ? నన్నొల్లనినాఁడు హనుమంతుని ముఖమున నే శీఘ్రముగఁ గొనిపోయెదనని యేలచెప్పి పుచ్చితిరి ? ఈమాట నాఁడే చెప్పిపుచ్చిన నింతదనుక రాక్షసీ పరిబాధితనుగాకుండ నే నానాఁడే ప్రాణంబులఁ బాసియుందును గదా ? తమకెల్లర కింతటిమహాశ్రమము, నీయకాండతాండవము, నీరాక్షసక్షయము, నేఁ డీదృశ్య మసంభావ్యముకదా ? నాథా ! పాంచభౌతికశరీర మతనియొక్కయు రాక్షసస్త్రీల యొక్కయు వశమున నుండెనేకాని ప్రధానములగుజ్ఞానకర్మేంద్రియములు నా యధీనంబులై యనవరతము దేవరపాదపద్మముల మర్కటకిశోర న్యాయమునఁ బట్టువిడువక యాశ్రయించియే యున్నవి. ఇందులకుఁ బంచభూతములు సూర్యచంద్రులే సాక్షులు.

శ్రీ:- జానకీ ! అటులైన నీశీలంబుపై శపథముఁజేసి చెప్పఁగలవా ?

జా:- ప్రాణపతీ! మీయాజ్ఞపై నిదియది యననేల ? అగ్ని నుఱుకు మనిన నిస్సంశయముగఁజొరనా ?

శ్రీ:- అదియుఁ జూడఁదగినదే.

జా:- పుత్రా ! లక్ష్మణా ! ఇంకను నాలసించెదవేల ?

చ. అనిశము రామభక్తి హృదయంబున వీడకయే జపించు నీ
వనితయెడ న్జనించె రఘువర్యునకు న్సెనసందియం బిఁకే
మన? వనితాత్వమే గనియె, నాత్మపవిత్రతఁగాంచఁడయ్యె నీ
జనపతి; పావకుం డగుత సాక్ష్యము; చొచ్చెద నిప్డె నేఁజితిన్.

ప్రాణనాథుని విశ్వాసపాత్రము కాని స్త్రీ యుండిననేమి మండిననేమి ? ఎవరో కులటలవృత్తంబుల మది నిడికొని స్త్రీలోకంబును సంశయించెడితటి వారు కోరువిధి శపథముఁజేయ వెనుకంజయిడుట శీలమును బరాభవించుటకాదా ? నిరంతరభర్తృపాదజపశీల నగునేను జంకవలసిన దేమియు లేదు. తత్క్షణమ చితి పేర్పింపుము.

ల:- (శ్రీరామునివైపు చూచును)

:- అనుజా ! సందేహించెద వేల ?

ఉ. కాననమందు రుచ్యఫలకందముల న్గొనివచ్చి శ్రద్ధ నీ
మానినిఁ గొల్చుచుంటిగద మాతృసమానగ! నన్నుఁజూడ నే
లా ? నళినాక్షియానతి విలంబనము న్బొనరించెదేల ? నా
యానతి యీధరాతనయయానతి వేఱని యెంచినాఁడవే?

ల:- అగ్రజా! శాంతస్వరూపుల రగుదేవరయాజ్ఞయం దేమేని సవరణ యుండునేమోయని తమదిక్కుఁ జూచితిని.

శ్రీ:- అనుజా ! నీ వారోపించిన శాంతస్వభావమునస్సైత మాజ్ఞావ్యత్యయముండుననియే తలఁచితివా ? ఇఁకనైన సందియముడిగి కార్యంబునకుఁ గడంగుము.

ల:- (స్వగతము) అగ్రజునాజ్ఞ యనుల్లంఘనీయము. ఆహా ! నాకెట్టిస్థితి తటస్థించినది ? అక్కటా ! దుర్భరము. దుర్భరము.

మ. కడుభక్తి న్జని కందమూలసుమసంఘంబు న్వడిం దెచ్చి మె
చ్చెదురీతి న్జనయిత్రి జానకిని నే సేవించునీచేతులన్
జెడుగానీచితిఁ బేర్పఁగావలసె ; వాసిం బాసి పూలమ్ము నం
గడిలోఁ గట్టెలనమ్మువానిగతి దుష్కార్మానుసారంబుగన్.

రామాజ్ఞ కింక నడ్డేమి కలదు ? తప్పదు. తప్పదు (చితిం బేర్చుచుండును)

హ:- (స్వగతము) అయ్యో ! ఇది యేమి ! కిష్కింధలో నున్నతటి మాంజానకీమాతకై వియోగార్తి సహింపలేక పొక్కినవాఁడు నేఁ డామె ప్రత్యక్షమగుతటి నిట్టికాఠిన్యము వహించినాఁడు. 'రాజానుమతో ధర్మః'. కింకరుఁడు ప్రశ్నింప ననర్హుఁడుకదా ?

సు:- (పటాక్షేపముతోఁ బ్రవేశించి) అయ్యో ! అయ్యో ! ఇది యేమిటి ? రామభద్రుఁడు జానకీసమేతుఁడై మాకు నేత్రానందసంధాయకుం డగునని మేము తలంచుచుండ నీవిట్టపిడుగువార్త యేమి ! ఈచితిపేర్పు లేమి ! హనుమా ! ఏమి యిది ?

హ:- ఇది యనుల్లంఘనీయ మగురామాజ్ఞ.

సు:- (కోపము నణచుకొని చేయునది లేక యూడుఁగఱచుకొని యూరకుండును. చితి మండును)

జా:- (అగ్నిహోత్రునకు ముమ్మారు ప్రదక్షిణముఁ జేసి) కర్మసాక్షు లగుసూర్యచంద్రులారా ! అగ్నిహోత్రా ! ఓయాకాశవాణీ ! ఈదీనురాలి మొఱాలింపుఁడు.

సీ. రావణుం డరుదెంచి 'రాణిఁ జేసెద'నంచు మూర్ఛిత నన్నుఁగొంపోవునపుడు
పదిమాసము లశోకవని రాక్షసులకత్తిమొనపోట్లఁ గాలంబుఁ బుచ్చునపుడు
తనవైభవము మోహమునఁజూప రావణుం డరుదెంచి కాళ్ళపై నొరగినపుడు
తనవంకఁ జూడనైనను మన మొల్లనిననుఁ జంపుఁడంచు నాజ్ఞనిడినపుడు

గీ. చలన మెఱుఁగనినామానసంబు రామసామమగ్నమైనదొ లేదొ సోమభాను
తారకలు సాక్షు; లంతేల తాపమునను మండుచుండెడియీదహనుండె సాక్షి.

ఉ. ఎందుననేని, నెట్టితటినేనిఁ, గలం గనువేళనేని హృ
న్మందిరమందు నాథుచరణస్మరణంబును మానకుందునే
నిం దయఁదాల్చి పావకుఁ డనింద్యచరిత్రను బ్రోచుఁగాత, న
న్నుం దహియించుఁగాత దహనుం డిసుమంతకళంక ముండినన్.

గీ. రామచంద్రుండు సత్యవ్రతుఁడయేని
నేను నిజము పతివ్రతనేని లోక
చయము నొకతుటి భస్మంబుసలుపు నాయ
నలుఁడు చందనపంకశీతలతఁ గాంచు.
(మండుచున్న చితిఁ జొచ్చును)
(హనుమత్సుగ్రీవ కపిబృందముల హాహారావములు వినంబడును)
(తెరలో)

గీ. హాళి ధరియించుపుష్పదామంబుఁ దీసి
వహ్నిలోఁ బడవైచినవానివగిది
పతివియోగార్తిఁ గృశియించుపరమపూత
జానకిని వహ్ని నిడె రామచంద్రుఁ డకట !

సు:- ఓహో ! ఇది యంగదవాక్యము. పొంగుచున్నపాలు. వారిం
చెద (నిష్క్రమించును)

ల:- ఉ. అంచితసద్గుణంబులకు నాలయమై విభునామమే సదా
యెంచుచు, భర్తృనాజ్ఞ వహియించి శిరంబున వచ్చినట్టియా
సంచితపుణ్య, వహ్నిఁ జొరఁ జక్కఁగ నీచితిఁబేర్చి, యీ
గ్గాంచియుఁ గూలిపోవక సుఖస్థితి నుంటివె? యక్షియుగ్మమా!
నాయొర్చిన యీకృతికి నిష్కృతి కలదా ? అనుల్లంఘ
నీయ మగునగ్రజాజ్ఞ కలదుకదా ?

గీ. చేతఁ గల్గుకృపాణంబుచేత నెన్నొ
శిరముల న్గూల్పఁ గత్తి దోషి యగునొక్కొ ?
రామహస్తాసి యీసుమిత్రాసుతుండు
దోషి యెట్లగుఁ గైంకర్యతోషిగాక ?
(తెరలో)

ఉ. పావన జానకీసతి కృపాపర ! శ్రీరఘురామచంద్ర ! ని
న్భావమునందు నెంచుచు ననారత ముండెడిసాధ్వి పావకుం
బావనుఁ జేయఁగల్గుటను భక్తిని వహ్ని వహించి వచ్చె, నీ
పావనశీలఁ జేకొని యపారముదంబుధి నోలలాడుమీ.

శ్రీ:- ఓహో ! ఇవి దేవతలవాక్యములు కాఁబోలు. దివ్యులారా ! వందనశతంబులు. మీయాజ్ఞఁ దలఁదాల్చుచున్నాఁడ. (అగ్ని హోతుడ్రు జానకీసమేతుఁడై ప్రవేశించి)

అగ్ని:- శ్రీరామచంద్రా ! నిష్కళంకచరిత్రయగు నీజానకిఁ గూడి సుఖింపుము.

శ్రీ:- చిత్తము. (తెరలో)

దీర్ఘాయు ర్భూయాత్

శ్రీ:- ఇది విధాతృనాశీర్వచనము. (తెరలో)

తథాస్తు.

శ్రీ:- ఇది యింద్రునియామోదము. (తెరలో)

శ్రీరామచంద్రా ! పరమసాధ్వియు, ననవరతపతిపాదాబ్జ భృంగమును, దహనునిసైతము చల్లవడఁజేసిన యీజానకినిఁగూడి సర్వసుఖము లనుభవించుచు నయోధ్యారాజ్యముఁ బరిగ్రహింపుము. నీదండ నుండఁగోరుపరమపూత జానకి నాదరింపుము.

శ్రీ:- సృష్టికర్తసంకల్పమున కన్యథాత్వము కలదా ? అటులే యగుఁగాక. పరమసాధ్వి ! జానకీ ! నాకఠినకృత్యంబు సైరింపుము.

జా:- ధన్యాస్మి. అనుగృహీతాస్మి.

శ్రీ:- ఉ. నీపతిభక్తి నే నెఱుఁగనే ? మహనీయగుణాలవాల ! యే
పాప మెఱుంగనట్టినినుఁ బావకుని న్జొరుమన్న నామన
స్తాపము నింతయంతయన శక్యమె ? నీకుఁ బ్రతిజ్ఞఁగూర్పఁగాఁ
బాపపులోకదూషణముఁ బాపఁగ నీవిధి నిర్ణయించితిఁ.

జా:- ప్రాణకాంతా ! మీయంతరంగము నే నెఱుఁగనా ?

గీ. కాంతిమంతమౌ నాయశఃకాయమునకు
నలముకొనినదుష్కీర్తిని ననలమందుఁ
గాల్చివైచినని న్నెంతకాలమైనఁ
బొగడవలెఁగాదె ? దూషింపఁబోలు నాకొ ?

(తెరలో) జానకీరామా ! దివంబుననుండి మిమ్ముల దర్శింప వచ్చిన మీ జనకుఁడు దశరథుని సేవింపుము.

శ్రీ:- ఇది యింద్రవాక్యము. ఈదివ్యతేజస్వి మాతండ్రియే. సందియము లేదు. (సంతోషముతో) పరమధన్యుఁడ. పరమధన్యుఁడ. (దశరథుఁడు ప్రవేశింప జానకీశ్రీరామలక్ష్మణులు సాష్టాంగదండ ప్రణామ మొనర్చి లేతురు)

ద:- దీర్ఘాయుష్య మస్తు. దీర్ఘసుమంగలీ భవ. సుపుత్రావాప్తి రస్తు. (శ్రీరామలక్ష్మణులను గవుఁగిలించుకొని) కుమారులారా ! రామ లక్ష్మణులారా !

చ. తెలియక నిర్జరార్థమును, దీనతఁ బొందితి నిన్ను నప్డు కా
నల కనుపంగ ; నిప్పుడు విన న్సకలంబు ప్రమోది నైతి, నీ
కెలనసముమూలకారణము కేకయపుత్రియె, ధన్య యయ్యె, నా
లలనను దూఱినాఁడను గలంగినచిత్తముతోడ నత్తఱిన్.

శ్రీ:- జనకా ! క్రుద్ధులరై యప్పట్టునఁ గైకసంబంధముఁ దెగనాడి భరతునితర్పణోదకంబులఁగూడ నే నొల్లనంటిరఁట. వాని నుప సంహరింపుఁడు.

ద:- శ్రీరామా ! అటులే యుపసంహరించితిని. తల్లీ ! జానకీ !

గీ. శీలవతివైన నీబోటిచెలువ మాకుఁ
గోడలైనట్టికతమునఁ గులము వన్నె
వాసిఁ గాంచెను ; భర్త్రాజ్ఞ వర్తిలుచును
గీయమానచరిత్రవై కీర్తిఁ గనుమి.

జానకీరామా ! సకలకల్మషాపహమగునశ్వమేధ మొనర్పుము. ఇఁక నే దివంబున కేఁగుచున్నాఁడ. సుఖంబున నయోధ్యఁ బాలింపుము.

శ్రీ:- అనుగృహీతోస్మి. అటులే చేయఁగలను.

ల. జా:- మహాప్రసాదము (మ్రొక్కుదురు)

జ:- చిరంజీవత (నిష్క్రమించును)

(తెరలో) శ్రీరామచంద్రా! జానకీసమేతుఁడవై సానుజుఁడవై సాకేతము సుఖంబునఁ బాలింపుము. మేము పోయివచ్చెదము.

శ్రీ:- ఇవి విధాతేశ్వర వాక్యములు. అనుగృహీతోస్మి (నమస్కరించును) (తెరలో) రాఘవేంద్రా!

గీ. భూమిపై రావణుండు ముప్పుట్టినట్టి
క్షణమునుండియు నిదుర గైకొనము నిజము
నేఁటి కది కూరె మీదుసాన్నిధ్యగరిమ
నెవ్విధిఁ గృతజ్ఞుఁడ నగుదు నెఱుఁగఁ జెప్పుఁడీ.

శ్రీ:- దేవేంద్రా! నాయందు నీకంతకరుణ కలదేని యీరామ రావణయుద్ధమున యమాలయాతిథు లైనసర్వకపిభల్లుకసైన్యముల సజీవులఁ జేయుటే నాకోర్కి. అట్లనుగ్రహింపుఁడు.

(తెరలో)

రాఘవేంద్రా! సర్వాంతరాత్ముఁడవు, నిచ్ఛామాత్రసంకల్పుఁడవునగునీవు నన్నుఁ గోరుటయా? మీసంకల్పమాత్రముననే పరిపూర్ణమైన మీయిచ్ఛ నే నొసంగినటులఁ దాము తలఁచుట నన్ను గౌరవించుటయే. అట్లే యగుఁగాక. (కపులు) మహాప్రభూ! రామరావణయుద్ధనిహతుల మైనకపుల మెల్లరము సజీవులమై తమకు వందనశతము లర్పించుచుఁ దమయాజ్ఞకై వేచియున్నారము.

శ్రీ:- స్వస్త్యస్తు. చిరంజీవినో భవంతు. (తెరలో) స్వామీ! ఇంద్రునకు సెలవా? చిత్తము.

వి:- రామచంద్రప్రభూ!

గీ. పదియునాల్గేండ్లు కాననావాసమునను
జటగ మారినమీశిరోజముల నేఁడు
సంస్కరింపంగ నాజ్ఞ నొసంగు మయ్య!
నాతునవి నాదరించి భక్తామరాగ!

శ్రీ:- భక్తాగ్రగణ్యా! విభీషణా! ఇపుడు నీవేఁడుకోలున కియ్యకొనుట కవకాశము లేదు. ఏలయన, భరతునికడఁ జెప్పినమాట యట్టిది.

చ. 'పదియునునాలుగేండ్లు గడువ న్ననుదెంచెద, నేను మాటఁ ద
ప్పుదునె' యటంచుఁ జెప్పితిగ ముద్దులతమ్మునితోడ ? మాట మీఱఁ
దగునె ? నాయెడ న్గలుగురక్తిని నావలె వేస మూని దుః
ఖదమగురోజుల న్గడపి కాంచఁగఁగోరెడి నన్ను మిత్రమా !

గీ. ఎల్లిభానూదయంబున కే నయోధ్యఁ
జేరకుండిన రానని చింతఁజెంది
దుర్దినంబని వహ్నిలో దుముకు నతఁడు
తమ్మునిం గాచునట్టి విధంబుఁ జెపుము.

వి:- శ్రీరామచంద్రప్రభూ! మీయనుగ్రహ మట్లున్న దాసుఁడేమి చేయఁగలఁడు ?

శ్రీ:- విభీషణా! చిన్నపుచ్చుకొనకుము. ఇదితప్ప వే జేయభీష్టమైనఁ దీర్చెద.

వి:- ధన్యోస్మి. సాకేతంబున దేవరవారి పట్టాభిషేకముఁ జూడవలయునని యందఱు గుతూహలులై యున్నారు.

శ్రీ:- తప్పక రావచ్చును. కాని రేపటికి నయోధ్యఁ జేరుమార్గమే తోఁపకున్నది. అది నమకూడ నభ్యంతర మేమున్నది ?

సు:- మహాప్రభూ! విభీషణునిపైఁగల యనుగ్రహము నాపైని గొంత రానిండు.

శ్రీ:- (ఇంచుక రోషించుచుండును)

సు:- ఆ. కోట్లకొలఁదిఁ గలుగుకోఁతుల నెలుఁగులఁ
బట్టణంబుఁ జేర్ప రట్టు కలుగు
ననుచు సందియంబు నందెదే కాని సు
గ్రీవునాజ్ఞఁ గనవు భావమందు.

అతిబలపౌరుషశాలు రగుకపిభల్లుకనాగంబులకు సుగ్రీవాజ్ఞ గారుడమంత్రము. పట్టణము రట్టుఁ బెట్టుదురని సందేహింపవలదు. నాదె పూచి. వారు పురజనబాధాకారకులు కాక మనుష్యరూపంబుల సంచరింపఁగలరు.

శ్రీ:- సుగ్రీవా ! ఆలాగే కానిమ్ము.

వి:- (స్మృతి నభినయించి) రావణసంపాదితకౌబేరపుష్పకము ప్రస్తుతము నాయొద్దఁ గలదుకదా ? దానిసహాయమున నొకపూటలో నయోధ్య చేరఁగలము.

శ్రీ:- సరియే. ఆలాగే. ఇఁక నేమి ? మీ రెల్లరు సంసిద్ధులు కండు.

వి:- చిత్తము.

(యవనిక జారును)



శ్రీ

# శ్రీ రా మ వి జ య ము



## పంచమాంకము.



(భరద్వాజాశ్రమము - భరద్వాజశిష్యులగు విశారదగాలవులు ప్రవేశింతురు. గాలవుఁడు కుంటుచుండును.)

వి:- గాలవా! తరువాతఁ జెప్పెదనంటివికదా. ఎవరా రాజర్షి దంపతులు, వారివెంటఁ జనుదెంచినసువర్ణచ్ఛాయ గలక్షత్రియుఁడు, నాయిరువురుప్లవంగులు, నా భల్లుకేశ్వరుఁడును ?

గా:- విశారదా ! వారు శ్రీరామ, జానకీ లక్ష్మణ సుగ్రీవ హనుమ జ్జాంబవంతులు.

వి:- మనగురువుగా రనవరతము శ్రీరామశ్రీరామయని జపించుచుందురే వారు వీరేనా ?

గా:- కాకేమిటి ? శ్రీరామచంద్రుఁ డనునాతఁ డాయాజానుబాహుఁడు నీలమేఘవర్ణుఁడే.

వి:- అట్లా చెప్పు. కనుకనే మనగురువులవా రంతగా గౌరవించి యీ రేయి యిచ్చట నిలువుఁడని చెప్ప ననుల్లంఘనీయమగు వారియాజ్ఞకు వల్లెయనెను. (అటునిటు చూచి విభ్రాంతితో) ఇదియేమి గాలవా ! నేను మేల్కొనియుంటినా నిదురించుచుంటినా ? నాకే సందియముగ నున్నది. ఇంతదనుక మోడువారిపోయినవృక్షము లెల్ల నింద్రజాలమునవలెఁ బూత, పిందెలు, కాయకసురులతోడను బండ్లతో నిండి నేలను దాఁక వంగి వసుంధరకు వింతశోభఁ గూర్చుచున్నవి. ఇట్లగుటకుఁ గారణమేమి ?

గా:- విశారదా ! ఇది నీకుఁ దెలియదా యేమి ? పరోపకారపారీణుఁ

డగు శ్రీరామచంద్రమహాప్రభువునకు సురేంద్రుఁడు వరం బొసఁగఁ దా నొకవర మొసంగఁదలఁచి గురువులవారు కోరుకొనుమనఁ దనపట్టాభిషేకముఁ జూడ సపత్నీకులై వచ్చుచున్న 72 వెల్లువలకపిభల్లుకసైన్యముల కానందసంధాయక మగురీతి నయోధ్యకేగుమార్గమునఁ గల సర్వవృక్షంబు లిట్లెల్లకాల ముందునట్లుండుటయే వరమని వేఁడిన వారు వల్లెయని యనుగ్రహించిరి. వారి మహత్త్వమే యిది.

వి:- ఎవరో యీమహోన్నతాకారుఁ డగు కపిశ్రేష్ఠుఁ డిటువచ్చుచున్నాఁడు. భయ మగుచున్నది.

గా:- అతఁడు హనుమంతుఁడు. మన కేల ? పోవుదము పద.

(నిష్క్రమించి చాటున డాఁగుదురు. హనుమంతుఁడు ప్రవేశించును)

హ:- రఘురామచంద్రమూర్తి యెంతయోచనాపరుఁడు ! అతనిప్రతి వాక్య మర్థసమేతమేకాని యొక్కటియు వృథ కాదు. నేను రామాజ్ఞ గగనమార్గమున శృంగిబేరపురముఁ జేరి శ్రీరామాగమనవృత్తాంతము భక్తాగ్రేసరుఁ డగుగుహునకుఁ జెప్పి నిర్జితమనోవేగంబున నయోధ్యకుఁజని నాస్వామిసేమము నాంతరంగికభక్తుఁ డని తెలుపఁబడిన భరతప్రభునకు నివేదించి యాతనిముఖవర్చస్సు గమనింప నియమించిన రామాజ్ఞ నిర్వర్తించెద. ఆకాననగునదే భరతుని నెలవగు నందిగ్రామము. అతఁడే యగ్నికిఁ బ్రదక్షిణముఁ జేయువాఁడు. ఆలస్యముఁ జేయఁజనదు. పోయెద. శ్రీరామచంద్రప్రభునకు జై (దుమికి నిష్క్రమించుచుండఁ దెర లేచును.)

(జటావల్కలధారి యగుభరతుఁడు జ్వలితాగ్నికడ నుండును).

భ:- ఆ. ఆ రయుఁగను గాలహరణంబుఁ జేయక
వెంట వచ్చునట్టి వేల్పు, నన్ను
రంగ దసురకుముదరాజీవమిత్రుఁడు
స్వామి సుకృతి వచ్చుజాడ యేది !

ఉ. పదియునునాలుగేండ్లు చన వచ్చెదనంచును బాసఁజేసి, త్రో
యఁదగని తండ్రియానతిని నాదలఁ దాల్చి వనిం జరింపఁగాఁ
గదలినయన్నరాకకయి కాదె నిరీక్షణఁ జేయుచుంటి నా
సదయునిరాకఘో యతనిసంగతియో యెఱుఁగంగరాదుగా !

అగ్రజాజ్ఞావశవర్తినై యీపదునాల్గేం డెట్లో వెడలనడ పితిఁగాని యాఁబోతు. మోయఁదగుభారము సంతసములేనిలేగ దూడ యెన్నిదినములు మోయఁగలదు ? ఎంతప్రయత్నించినను మోయఁజాలదు. మోయఁజాలదు. అన్న యాడితప్పువాఁడు కాఁడు. ఏకార్యాంతరమువలననో యతఁడు గడవునకు సరిగా రాలేకపోయియుండును. పదవాక్యప్రమాణజ్ఞుఁడగు నాయనఘుఁ డేదో నిమిత్తముచేఁ దప్పియుండవచ్చునుగాని యాయనతమ్ముండ నని చెప్పుకొనుట, కేయాటంకము లేని నేను నామాట నేలతప్ప వలయును ?

గీ. "పదియునాల్గేండ్లు నిశిగ నెప్పగిదో త్రోతు
రామభానూదయంబును బ్రేమఁ గోరి
నాఁడు దుర్దినంబైన ననలముఁ జొత్తుఁ
ద్రికరణవిశుద్ధి రఘుకులతిలక ! నిజము.

అని నాఁడు నుడివి నేఁడు తప్ప నాకుఁ దగునా ?

చ. కులగిరులెల్ల బ్రద్దలయి కూలిన, నంబుధులెల్ల దాటి భూ
వలయము ముంపవచ్చినను, పల్కనృతంబు వచింపనట్టియా
జలజహితాన్వయాబ్ధిశశిజాడ కనంబడకుండెఁ గాన, నా
పలుకును నిల్పఁ బ్రజ్వలితవహ్నినిఁ జొచ్చెద రామభక్తితో.

(అగ్నికి రెండుప్రదక్షిణము లొనర్చి మూడవది ముగియక మున్నే) (తెరలో)

ఉ. వచ్చెడి రామదూతఁ గనవా? భరతార్య! యిదేమి వహ్నిలోఁ
జొచ్చుట నారకప్రదముసుమ్మ ; నినుం గన మేటికాంక్షతో
వచ్చెడిరామచంద్రవిభువాంఛను వమ్మొనరింప నెంచితే
యిచ్చితిఁ జొచ్చి ? భక్తతతి కెన్నఁటికేని నపాయమున్నదే !

(ఆకసమువంకఁ జూచి) ఎవ రీయమృతోపమానవాక్యంబులఁ బల్కుచు నీసోదఁ జొచ్చునాసోదఁ దీర్పవచ్చినభక్తకల్పక ప్రాయుఁ డగురామదూత! ఆతనికిఁ దత్క్షణ మెదురేగెద. (సత్వరమ పరిక్రమింపఁబోవ హనుమంతుఁ డెదు రరుదెంచును)

హ:- రామభక్తభరతప్రభువునకు జై. (భరతుఁడు హనుమంతుని గౌఁగిలించుకొనును) భరతప్రభూ! ఇంతత్వరయా? ఒక్కక్షణ మాలస్యమైన మాకవార్యదుఃఖంబుగూర్చి మా సంతసమంతయు భిన్నభిన్నంబులఁ జేసియుందువుకదా?

భ:- రామదూతా! మాయన్నగా రేరీ? నీ వే రేమి?

హ:- ఆర్యా! శ్రీరామచంద్రునిపంపున వచ్చినాఁడ. నేను వాయుపుత్రుఁడ నగునాంజనేయుఁడ.

భ:- వా రేరీ?

హ:- ఉ. కచ్చియ సీతఁ గొన్న దశకంఠుని ద్రుంచిన మేటిసేనతో
నచ్చపుభక్తి విగ్రహతనందిన ని న్మదమారఁ గాంచఁగా
వచ్చుచునున్న వాఁడురఘువర్యుఁడు రాముఁడు, తమ్ముఁగూర్మితో
నచ్చినజాయతో, దనుజనాథునితో, రవిసూనుతోడుతన్.

భ:- ఆంజనేయా! పరమసంతోషము. ఇందఱు రామకార్యధురంధరుల, భక్తుల నొక్కయెడఁ జూచుటచేఁ బరమధన్యుఁడ. వా రిపు డెచ్చట నున్నారు? ఎప్పుడు వత్తురు?

హ:- భరతార్యా! ఈదినము భరద్వాజర్షి వేడ్కలున వారియాశ్రమంబున విడిసిరి. రేపు సూర్యోదయాత్పూర్వ మిచటికిఁ జేరఁ గలరు.

భ:- సోదరా! శత్రుఘ్నా!

(శత్రుఘ్నుఁడు ప్రవేశించి)

శ:- అగ్రజునకు వందనము

భ:- దీర్ఘాయుష్మాన్ భవ.

శ:- ఏమి యాజ్ఞ?

భ:- శత్రుఘ్నా ! అగ్రజుఁడు రామచంద్రమూర్తి యెల్లిసూర్యో దయమున కిటఁ జేరనెంచి యీపావనిని మున్ముందు పంపిరి. పురి ననువగువిధమున శృంగారింపఁజేయ నాజ్ఞయిమ్ము.

శ:- మహాప్రసాదము. (నిష్క్రమించును)

భ:- హనుమంతా ! చిత్రకూటపర్వతమునుండి నేను నందిగ్రామముఁ జేరినది మొద లన్నగారిచరిత్రముఁ జెప్పుము.

హ:- ప్రభూ ! సర్వము సాంతముగ వచింతు రండు. (భరతాంజనేయులు నిష్క్రమింతురు.)

(కృష్ణవర్మ గోవిందవర్మ లనునిరువు రయోధ్యాపౌరులు ప్రవేశింతురు)

కృ:- గోవిందవర్మా ! నేఁటికిఁగదా యీరికలెత్తుమనకోరికలు ఫలింపనున్నవి.

గో:- కృష్ణవర్మా ! అగును.

గీ. రామదర్శనస్వాతివర్షమున కెదురు
సూచుచున్న యీప్రజనేత్రశుక్తులకును
రామవిభుని త్కేమోదంతనామహిమము
కొంత యాప్యాయనంబుఁ జేకూర్చె హితుఁడ !
(శత్రుఘ్నుఁడు సత్వరమ ప్రవేశించును)

శ:- పౌరులారా ! పురమెల్ల నలంకరింప ననుజ్ఞయియ్యఁబడియుండఁ గర్తవ్యము మాని యిచట మసలుచున్నా రేల ?

కృ:- శత్రుఘ్నప్రభూ ! తమయాజ్ఞకు ముందే హనుమదాగమనంబు వీనులఁ బడఁగనే పురి సర్వవిధాలంకారశోభిత నొనర్చి మహా ప్రభువురాకకై యాతురతచే నిచటికి వచ్చితిమి.

గో:- స్వామీ ! అటు తిలకింపుఁడు.

సీ. తలగుడ్డఁదీసి చేతను వహింపకయె కన్పడనిరాత్తగుచల్వపందిరులును
కనుగవ విచ్చి చూడనిరాఁడ నంత గన్పడనట్టి తెల్లచప్పరపుగమియు
లోఁగొన్న సౌరభం బేగతి విడుతుమా యనిపించు జవ్వాదియగరుబాగలు
పదములాగులునైనఁ బఠమరాగులఁ జేసి కరగించు శ్రీరామగాథగాన

గీ. స్ఫటికకంబాలసొబగుఁ గప్పురపుముగ్గు
పచ్చలమయంపుతోరణపంక్తి వివిధ
వర్ణములు గలపెక్కు మవ్రిజలు నృపుని
యెడలఁ గలభక్తిగౌరవం బెంతొ చూపు.

శ:- పౌరులారా! మీరు పరమధన్యులు. నృపుని నృపమాత్రునిగాఁ గాక సాక్షాద్విష్ణ్వంశసంభూతునిగ నెంచుచున్నారలు. ఇదిగో హనుమత్సమేతుఁడై యగ్రజుఁడు వచ్చుచున్నాఁడు.

కృ. గో:- జయము జయము మహాప్రభువులకు. (అని ప్రక్క కొదుగుదురు. హనుమద్భరతులు ప్రవేశింతురు)

శ:- అగ్రజున కభివాదనములు.

భ:- చిరంజీవ. తమ్ముఁడా! పురశృంగార మైనదా?

శ:- అగ్రజా!

గీ. ఆణిముత్తెంపుజాలరు లమరియుండఁ
గప్పురంపుటనంటుల కంబములును
గరుడపచ్చలతోరణకాండ మమరి
పెండ్లియిలు మించి కనులకు విందుఁగొలుపు.

భ:- హనుమా! సూర్యోదయ మైనది. అన్నగా రింకను రాకున్నారే? అన్నగా రీరోజు తప్పకవచ్చెదరని నీచెప్పినది కపిచాపల్యమునఁ గాదుగదా?

(తెరలోఁ గపిభల్లుకసింహనాదములు విమానశబ్దము వినిపించును)

హ:- (నవ్వుచు) భరతప్రభూ! కాదు కాదు. ఆకపిభల్లుకారావంబుల వింటిరికదా?

ఉ. ఆవినసైనరావము మహాకుతుకంబున గోమతీనదీ
పావనియైనవాలుకిని వానరసంఘము దాటునట్టిదే
భూవర! మింటిపైపునను బుష్పక మయ్యదె వచ్చుచుండె రా
మావనినాథుతోడ, జనకాత్మజతో, సకలాప్తకోటితోఁ.

భ:- (ఆతురతతో) హనుమా! ఆపట్టపగటిచుక్కవలెఁ బ్రకాశించుచున్నదేనా పుష్పకము? ఎంతవడిగా వచ్చుచున్నది?

గీ. ఒక్కతుత్రిటిలోన రిక్క యై యొక్కనిముస
మందు ఖగమయి, మఱుమాత్రయందు శార
దాంబుదం బయి, దరియఁ బతంగంబు లొప్పు
నగ మగుచు, దాని మించెడినగర మయ్యె.

అదిగో యది భూమిపై మన కనతిదూరమున సమప్రదేశమందు నిలిచినది. సత్వర మేగి యగ్రజపాదాభివందన మాచరింప నరుగవలయు. (ఇంచుక పరిక్రమింపఁ దెర లేవ జానకీ శ్రీరాములాసీనులై వెనుక లక్ష్మణ, విభీషణ, సుగ్రీవులు నిలిచియుందురు)

భ:- అగ్రజవధూనికలకు: గింకరుఁడు భరతుఁడు మ్రొక్కుచున్నాఁడు. (ఆనందబాష్పములతో సాష్టాంగదండప్రణామ మొనరించి లేచి) భరతశిరోభూషణంబు లగుపాదుకలు శ్రీరామచంద్రమహాప్రభుపాదకమలభృంగము లగుఁగాక. (అని పాదములచెంత నుంచును)

ల:- (భరతునకు మ్రొక్కును.)

భ:- దీర్ఘాయుష్మాన్ భవ.

శ:- (లక్ష్మణునకు మ్రొక్కును)

ల:- దీర్ఘాయుష్మాన్ భవ.

శ్రీ:- భరతశత్రుఘ్నులారా! చిరం జీవతం. ఇటు రండు. (చేరఁదీసి భరతశత్రుఘ్నులఁ జెరియొకయంకమునఁ గూర్చుండఁబెట్టుకొని మూర్ధ మాఘ్రాణించును.)

జా:- వత్సలారా! కళ్యాణ మస్తు.

భ:- అగ్రజా!

గీ. రామచంద్రాంబుదంబుదర్శనము గోరి
భరతుఁ, డంబలు, ప్రజలు దైవమును గొలువఁ

బదియునాల్గేండ్లు, కోరిక పండె నేఁడు
రామజలదకృపామృతరమ్యవృష్టి.

శ:- అగ్రజునిదర్శనమున మాకన్నులు సఫలము లైనవి.

శ్రీ:- అనుజా! భరతా!

గీ. నాయనా! వనమం దున్ననన్ను మించి
పట్టణస్థితు నినుఁగన వగపు కలిగె
నీదు గురుభక్తిని న్గాంచికాదె తండ్రి
నీనివాపంబులను గొన నెమ్మి యొప్పె.

రాజ్యం బంతట నీతిబాధలు లేక సుఖమే? భాండారము లెట్లున్నవి? వసిష్ఠాదిపురోధలకు భద్రమే?

భ:- అగ్రజా! మీ కరుణాపాంగావలోకనమున నసుఖ ముండునే. భాండారము దశగుణితమై దేవరకై యెదురుచూచుచున్నది. అదిగో గురువులవారు వచ్చుచున్నారు. తమ్ముఁడా! యెదురేగి పిలుచుకొనిరమ్ము. ( శత్రుఘ్నుఁడు నిష్క్రమించి వసిష్ఠునితోఁ బ్రవేశించును )

శ్రీ,జా,ల,భ,శ:- (వసిష్ఠునకు నమస్కరింతురు)

వ:- చిరం జీవత. శీఘ్రమేవ అభిషేక మస్తు. కళ్యాణ మస్తు.

శ్రీ:- గురువరా!

చ. భరతునిఁ బోలుసోదరుఁడు, భానుజుఁ బోలిననేస్తుఁడు, ♦ న్నిశా
చరుని, సుమిత్రినందనునిచాయ భజించెడి భక్తవర్యులుఁ
ధరణిజఁ బోలుభార్య, నహి. తాపసపుంగవ! ధాత యెంతనే
ర్పరి యిటువంటివారి నొకపట్టునఁ గూర్చుట చిత్రమై ఖరిః !

వ:- శ్రీరామచంద్రా! నిజమేకాని యాతనిధీమహిమ నీవు పూర్ణముగ గ్రహింపవైతివి. వినుము.

చ. తనను వరించురాజ్యరమఁ దండ్రి వచించినమాటఁ దీర్పఁగా
నణువుగఁజూచి కాననముకై చనుభూపుని రాజుఁజేయుట

---

♦ విభీషణుఁడు.

శ్రీ:- గురువరా! మాటొకటియుఁ గలదు.
న్మునికులవంశమునందను సమానతపోమహిమాభిరామ వా
జనపతి కొజ్జగా నిడుట, శాపజితారివసిదవానలా!

వ:- శిష్యశిరోమణీ! మీ జనకుని ప్రతిజ్ఞయు, మీ యన్నదమ్ముల సమ
యము లన్నియుఁ దీరెఁగదా! నేఁడే నీపట్టాభిషేకమున కెంత
యు సర్వశోభనలగ్నము. కావున జటాసంస్కారాదుల నొన
రించుకొని మంగళస్నాన మొనరించి సిద్ధము గమ్ము.

[తెరలో]

శ్రీజానకీయుక్త శ్రీరామచంద్రప్రభువును జూడఁ గౌసల్యాది
మాతృవర్గంబు వచ్చుచున్నది.

శ్రీ:- గురువరా! మీయాజ్ఞానుసారమే యగుఁగాక. నా వనవాసం
బున కెంతయుఁ గుందుచున్న మాతృవర్గంబున కెంతమాత్రము
శ్రమఁగూర్ప నిచ్ఛగింపను. వారిదర్శింప నేనే పోవుచున్నాఁడ.
జానకీసౌమిత్రులారా! రండు.

వ:- రామచంద్రా! అటులే చేయుము. (వసిష్ఠభరతులు తప్ప నెల్ల
రును నిష్క్రమింతురు.) భరతా! పట్టాభిషేకంబునకుఁ కేమి
యాలస్యము?

భ:- గురువర్యా! సర్వము సిద్ధము. (తెరలో)

గీ. సంస్కృతజటాభరుండయి స్నాతుఁ డగుచు
దివ్యభూషణభూషితదేహుఁ డగుచు
జానకీయుక్త శ్రీరామచంద్రవిభుఁడు
సభకు నరుదెంచెడిని దిశాసమితి వెలుఁగ.

(తెర లేవఁగాఁ బట్టాభిషేకమంటపము కవఁబడును)

భ:- అగ్రజా! ఇటు. ఇటు. (శ్రీరామచంద్రుఁడు, జానకీయుక్తుఁడై
ప్రవేశించును. వెనుకనుండి సుగ్రీవ, విభీషణ, హనుమ, ల్లక్ష్మణ,
శత్రుఘ్న, సౌమంత్ర, పౌరులు ప్రవేశింతురు)

వః- అయోధ్యాసింహాసనాధిష్ఠితశ్రీరామచంద్రప్రభునకు సార్వభౌమ చిహ్నంబు లగుశ్వేతచ్ఛత్ర, మకుట, క్షౌమేయంబు లొసంగు చున్నాఁడ. (జానకీశ్రీరాములు నమస్కరించి సింహాసనమును దరియ శ్రీరామునిశిరముపై మకుట ముంచి హస్తమునఁ గరవాల ముంచును.)

శ్రీః- (వినమ్రుఁడై) మహాప్రసాదము.

వః- ఇన్నిదినములనుండి యయోధ్యాపౌరులు కోరుచుండిన శ్రీరామ చంద్రమూర్తి సార్వభౌమపదము నలంకరించి ప్రజల నందఱఁ గన్నబిడ్డలకంటె నెక్కుడుగఁ జూచుచు ధర్మప్రవర్తనమునఁ దొంటి దిలీప, రఘు, అజ, దశరథులఁ దప్పక మఱపింపఁజేయఁ గలఁడని మాదృఢవిశ్వాసము.

శ్రీః- గురువరా! సామంతులారా! పౌరులారా! ఆప్తబంధువు లారా! మహాప్రతిభాశాలు రగుమాపితృపితామహప్రపితామ హాదులలోనే నేయంశము గాకుండినను బదవాక్యప్రమాణజ్ఞు లగుమాగురువరులవాక్యప్రభావంబుచే నలవడినకించిచ్ఛేముషీ పటిమంబున నాశిరంబున నుంచఁబడిన యీమహాభారమును శక్తి వంచన యించుకయు లేక ధర్మమార్గానుసారంబుగ వహింపఁ గంకణము గట్టుకొంటిని. కావున జనానురంజకమును, జనాభీష్టాను సృతము కాని నాస్వసౌఖ్యమునైనఁ దృణప్రాయముగ నెంచి వారలయిష్టానుసారమే రాజ్యపాలనముఁ జేయ నియ్యకొనియే యీమకుటమును దాల్చితినని ప్రకటించుచున్నాఁడ. ఇట్టియాశ యము గలనేను ధర్మమార్గావలంబి నగుటలో ధర్మవిధముగ సానుభూతిఁజూప నెల్లరఁ బ్రార్థించుచున్నాఁడను.

ఎల్లరుః- మేము ముమ్మాటికిని సానుభూతియు రాజభక్తియుఁజూప బద్ధకంకణులమై యున్నారము. శ్రీజానకీరామచంద్రసార్వభౌము నకు జై (అని ముమ్మారు కేకలు వైతులు)

వః- శ్రీరామచంద్రసార్వభౌమా! మఱేమి కావలయును?

## పంచమాంకము

శ్రీ:- మీయనుగ్రహమున నా కేమికొదువ ?

వ:- అయిన నిట్లగుఁగాక.

### —♦ భరతవాక్యము. ♦—

చ. హరిసుతురీతి, రావణునియట్లు వృధామదమూనుచు న్పరో
దరులఁ బరాభవించునృపతండ మడంగునుగాక ; భక్తులై
భరతునిబోలుతమ్ములు నృపాలురఁగొల్వఁగ ధర్మరాజ్యముల్
దిరమగుత ; గ్రీశ్వరనుతిప్రకరాక్షుతల న్వహించు మక్.

(యవనిక జారును)

### గద్యము

ఇది శ్రీరామచంద్రనిర్వ్యాజకరుణాసాదితకవితావిరాజమాన హారీత
సగోత్రోద్భవ ఆపస్తంబసూత్ర ఆదూరివంశపయఃపారావారరాకా
సుధాకర కేశవాచార్యపౌత్ర వేంకటరామానుజాచార్యాండా
ళాంబాప్రియపుత్ర శ్రీరామచంద్రపాదారవిందేందిందిరాయ
మాణమానస శ్రీవైష్ణవపాదరేణు విబుధ
మిత్ర వేంకటరంగస్వామి కవిప్రణీత
శ్రీరామవిజయము
సంపూర్ణము.



చంద్రికా ముద్రాశాల - గుంటూరు.

# శ్రీరామవిజయశుద్ధపత్రిక.

| పుట. | పంక్తి. | అసాధువు | సాధువు |
|---|---|---|---|
| 8 | 10 | స | న |
| 32 | 7 | వెంట | వెంట |
| 38 | 3 | వీరపుత్రి | వీరమాత |
| 64 | 5 | తన్ను | తనను |
| 66 | 1 | ముసిగిన | ముగిసిన |
| 66 | 4 | ,, | ,, |
| 67 | 6 | పరాభవముసకు | పరాభవమునకు |
| 74 | 15 | మరిమళింపదు | పరిమళింపదు |
| 94 | 22 | నసుట | నగుట |